# బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్.

---

కడపపట్టణ నివాసియగు ఖాన్‌బహదూర్ హెచ్. యస్
ఏ. యం. మంజూమియ్యా **M. S. A. L.**
హానరెరి మేజస్ట్రీటు, మునిసిపల్ కౌన్‌శిలర్ అండ్
ప్రైమరిస్కూలు ఎగ్జామినేషన్, బోర్డుమెంబర్
అను వారివల్ల వ్రాయబడిన

## అఖాయదెఇస్లామ్ - ఫిఖహెఇస్లామ్

అనగా

మహమ్మదీయులయొక్క మతమునకు సంబంధించిన
సదాచారమును, ధర్మశాస్త్రమును గురించి.



ఇది

మహమ్మదీయన్ మతగ్రంథములలోనుంచి తెలుగింపబడి
పండితులచే పరిష్కరింపబడి

కడప కల్యాణ కుమార విలాస ముద్రాక్షరశాలయందు
మానేజరు, వి. జానకిరాం నాయుడుగారిచే
1903 సంవత్సరం శెప్టంబరు నెలలో
ముద్రింపంబడి ప్రకటింపబడినది.

---

K. C. V. Press—Cuddapah.

# The Faith of Islam and Law of Religion.



1. In the name of Allah Jalla Shanaho, the Most Gracious and Most Merciful. Heaven's choicest blessings on His blessed Prophet Hazarath Syedina Muhammad and His companions and posterity. Kuranai Sheriff that is the Holy Kuran teaches the following of Islam. "O Auti-vulla-ha. O Autivur-Rasoola—Vulil Amry Minkum." Meaning, obedience to God, the Prophet and the King.

2. It has been an old and well known maxim of Islam, that the "Subjects imitate their rulers" and it is one of its enjoined duties that the people should always be loyal and grateful to and sympathizing with their sovereign. I had the opportunity of publishing two small books in Telugu a few years ago. The first is clalled the "FiveFundamental Doctrines of Islam" and the second the "Light of the Religion of Islam" during the reign of our beloved mother Her Most August Majesty the Queen Empress of India—Kaesari—Hind. (Peace be on her soul).

3. Again an opportunity is come for me to publish another small book called the "Faith of Islam and Law of Religion". I consider this opportunity to be a golden one, in as much as I have the fortune of expressing the greatness and benevolence of His Most Gracious Majesty King Edward the VII and Emperor of India—the Royal Trustee and Zill-ul-lah—the shadow of God. I call the Emperor as the Royal Protector of Faiths, because, he supports the Mahomedan Religious Institutions founded

in the time of Mahomedan Government such as Mosques, Durgas, and Asarai Sheriff &c., by giving endowments. If he is not the protector of the faith of Islam, why does the British Government safe-guard the interests of the above said Institutions and of the pilgrims that go to Mecai Sheriff. In this sense I call him the protector of faiths. He is also the protector of the Divine Secrets, since they were handed down to him from King Hazarath Solimon Auli-His-Salam about 5,000 years ago. In fact God has ordained him to this exaulted position of being both a protector and Ruler of Mahomedans of India. Eversince the Divine Secrets were revealed to him, he became the protector of the faith of Islam. The great Persian Poet Hazarath Sheik Sadi (Rahamatulia-Alaihi) in his works called—Gulistan and Bostan, wrote much about the Shah of Persia—Atabuk Sadbin Zhanghi. If this poet had lived now, he would have written much abont our Most Gracious Emperor, forgetting his own Shah.

4. I, humble and insignificant, though not endowed with poetic genius like that of old Sadi, find it a great pleasure to express my feelings of gratitute for the great liberty enjoyed by the followers of Islam. In short, I pray the choicest blessings from above may be showered on His Most Gracious Majesty the Emperor of India, Queen Alexzandra, His Royal Highness the Prince of Wales and His Royal Highness the Duke of Cannaught.

5. There is an old proverb—"As is the King, so is the subject." The Governer of the Presideney, His Excellency Lord Ampthill possesses all the good qualities like

the Emperor. He is so very kind and sympathizing with all over whom he rules, that he extends his benevolence to the cause of Mahomedan Education and to the protection of their faith. The ruler of the district Bannatyne Macleod Esquire, M.A., I.C.S., Bar-rister-at-law who not only sympathizes and safe-guards the interests of the ancient Mahomedan Religious Institutions, but also looks to the welfare of Mahomedans and Hindus in general in the district.

6. I have written this small treatise in Telugu, as this language is spoken in a great portion of the Madras Presidency, both by Mohamedans and Hindus. I have not denounced in this book any of the several Religions but I have only confined myself to make known the Faith and Law of Islam to Mahomedan and Hindu brothren.

7. I dedicate this small pamphlet to Allah Jalla Shanaho, O Umma-nava laho, to whom all praise is due.

CUDDAPAH,
16th September 1903.

H. S. A. M. MANJUMIAH.

——(*)——



## విజ్ఞాపన.

బిస్మిల్లా - హిర్రహమా - నిర్రహీమ్.

అల్హందు - లిల్లాహి - అలానవాలిహి - వస్సలాతు - వస్సలాము - అలా-రసూలెహి - సయ్యదినా - మొహమ్మదిన్-వ-ఆలెహి - వ - అస్హాబెహి - అజ్మయీన్ ॥

యావత్తుస్తోత్రము శ్రీభగవంతునికే సమర్పణమవును.

హజరత్ సయ్యదినా మొహమ్మదుగారియందున్ను వారిసంతతి వారియందున్ను యావత్తుసహచరులయందున్ను శ్రీభగవంతునియొక్క ఆశీర్వాదము కలుగునుగాక.

ఈచిన్నపుస్తకము రెండుభాగములుగా భాగింపబడినది.

(1) అఖాయిదె - ఇస్లామ్

అనగా

మహమ్మదీయులయొక్క మతమునకు సంబంధించిన అంశములను సదాచారములను గురించి.

(2) ఫిఖహె - ఇస్లామ్.

అనగా

మహమ్మదీయులయొక్క మతమునకు సంబంధించిన ధర్మశాస్త్రమును గురించి.

ఈచిన్నపుస్తకమును చదువు మహనీయులందరు తప్పులను మన్నించి సుగుణములను గ్రహించుదురని ప్రార్థించెదను.

——(o):(o)——



# బిస్మిల్లా హిర్రహిమాన నిర్రహీమ్.

## అఖాయదె ఇస్లామ్

అనగా

మహమ్మదీయులయొక్క మతమునకు సంబంధించిన అంశములను, సదాచారములను గురించి.

పహిలాబాబ్ అనగా మొదటిభాగము.

ఫసల్ పహిలి ఇమాన్ కె బయాన్ మె

అనగా

మొదటి అధ్యాయము - విశ్వాసమును గురించి.

బిస్మిల్లా - హిర్రహిమా - నిర్రహీమ్.

అనగా

మిక్కిలి ప్రేమకలిగినటువంటిన్ని అతికరుణాకరుడవైనటువంటి నీపరిశుద్ధమైన నామముతో ప్రారంభించుచున్నాడను.

శ్రీయుతుడవగు ఓభగవంతుడా! నిన్నెంతటివాడవని నుతింప నాజిహ్వకు నెంతటిశక్తియుచాలదు. నిండా కరుణకలవాడవుగాను, నిండా ప్రేమగలవాడవుగా నున్నావు. నీచేతపంపబడెన హజరత్ సయ్యదినా మహమ్మదుగారు సమ్మతించినట్టిదారిని చూపుము. ఎంత వరకు నాశరీరములో జీవాత్మయుండునో అంతవరకు హజరత్ సయ్యదినా ఖాతిమిన్ - నబీయిన్ - వ . షఫీయుల్ - ముజ్నబిన్ -

మొహమ్మదిన్ - స్వల్లల్లాహు - అలైహి - వ - ఆలిహి - వ-అస్ - హాబెహీ - అజ్మయిన్ ‖. అనగా

వారియొక్క సంతతివారియందును, వారిసహచరులయందును, నాప్రాణమును ప్రియంబుగా సర్పణముచేయుటకు విశ్వాసము దయచేయుము.

ఓమహమ్మదీయ సహోదరులారా! రాండి ఇస్లామ్‌యొక్క ఫలమును గ్రహించి మోక్షమును పొందండి.

# ఇస్లాం.

ఇదిమనకు దేవునియొక్క గొప్పఆశీర్వాదము.

ఈపదముయొక్క అంతరార్థమున్ను బాహ్యార్థమున్ను యేమనుజుడు మనోనిశ్చయముతో గ్రహించివుంటాడో అట్టిపురుషునిమీద భగవంతునియొక్కకృపయు ఆశీర్వాదమున్ను యీలోకమునందును పరలోకమునందును కలుగుచున్నది. అట్టిమనుష్యునియొక్క పూజ (నమాజ్) భగవంతుని సన్నిధిలో ఒప్పబడును.

ఇల్మె అఖాయద్

అనగా

మతమునకు సంబంధించిన అంశములు ప్రతిమనుజుడు తెలుసుకోవలసినది.

# ఇమాన్

అనగా

విశ్వాసము, లేక నమ్మిక.

శ్రీభగవంతుని యుత్తరువువల్ల హజరత్ సయ్యాదినా మొహమ్మదుగారుచెప్పిన యావత్తు అంశములను మనఃపూర్తిగా నమ్ముట, వాక్కుతో చెప్పుట.

ఉదాహరణము.

ఎఖ్రారున్ - బిల్-లె-సాని - వ తస్దీఖున్ - బిల్ ఖల్బ్

ఇట్టి "ఇమాన్" తెలిసిన మహమ్మదీయులు "మోమిన్ ముసల్ మాన్ అని పిలువబడుతారు.

ఇమాన్ అనగా నమ్మిక.

ఇస్లామ్ అనగా క్షేమము.

ఈరెంటికి భేదమేమనగా "ఇమాన్" అనగా మనోనిశ్చయం "ఇస్లామ్" అనగా మతసంబంధమైన హజరత్ సయ్యాదినా మొహమ్మదుగారిచేత చెప్పబడిన సదాచారములను విధేయతతో నడుచుకొనుట.

ఇమానె ముఫ్సిల్

అనగా

మహమ్మదీయన్ మతస్తులయొక్క విశ్వాసవివరము.

శ్రీభగవంతునియందు విశ్వాసముంచడమును, దేవదూతలయందు విశ్వాసముంచడమును, పరిశుద్ధములైన వేదములను నమ్మడమును యావత్తు పైగంబరులు అనగా ప్రవక్తలయందు విశ్వాసముంచడమును ప్రళయకాలమునందు శ్రీభగవంతుడుచేసే న్యాయపరిపాలనయందు విశ్వాసముంచడమును, మరణానంతరము తిరుగా లేచే అంశమును గురించి నమ్మడము మొదలైనవి.

ఉదాహరణము.

ఆమన్తు-బిల్‌ల్లాహి - వ-మలాయికతిహీ - వ-కుతుబిహీ వ-రుసులిహీ - వల్-యౌమిల్ - ఆఖిరె - వల్-ఖద్రె - ఖైరిహీ - వ షర్రిహీ - మినల్‌ల్లాహి - త-ఆలా - వల్-బాస-బాదల్ మౌత్ ॥

ఇందులోని అతిరహస్యములను అనగా అంతరార్థములను మహమ్మదీయులు గురుశుశ్రూష చేయుచు గ్రహించుచున్నారు.

ఇమానె ముజ్మిల్

అనగా

మహమ్మదీయ మతస్థులయొక్క విశ్వాసవిషయమైన సంగ్రహము లేక సంక్షేపము.

శ్రీభగవంతుని నమ్మడము. శ్రీభగవంతునియొక్క అన్నియుత్తరువులను శ్రీభగవంతుని ఆజ్ఞానుసారముగా హజరత్ సయ్యదినా మొహమ్మదుగారిచే నివ్వబడ్డ యావత్తు యుత్తరువులను నమ్మడము.

ఉదాహరణము.

ఆమన్తు - బిల్-ల్లాహి - కమాహువా - బ్యఅస్మాయెహీ వ-సిఫాతిహీ - వ-ఖిబల్‌తు - జమీయె-అహకామెహీ ॥

అనగా

ఇందులోని అతిరహస్యములగు వేదాంత విషయములను మహమ్మదీయులు గురుముఖముగా గ్రహించుచున్నారు.

మస్‌లా అనగా ఆలోచించవలసిన అంశము.

షరతాఁ - ఇమాన్ కె - సాత్ హిఁ

అనగా

విశ్వాసముయొక్క షరత్తులు ఏడు.

(1) ఇమాఁలానా గైబ్ పర్

అనగా

అగోచరములైన విషయములయందు

(2) గైయిబ్ కె - బాతాఁ పర్

అనగా

అట్టి అగోచరములలోనుంచి జరుగబొయ్యె సంగతులయందు;

(3) ఖుదా మెతాలా - జాఁతాహై

అనగా

శ్రీభగవంతునికితప్ప యితరులకు తెలియదు.

(4) ఇమాఁలానా - అవ్ ని - యక్ తియారిసె

అనగా

స్వేచ్ఛతోనున్ను భక్తితోనున్ను విశ్వాసము తెచ్చుకొనుట.

(5) హలాల్ కు - హలాల్ - జాఁనా

అనగా

శ్రీభగవంతుడు చెయ్యమని శాస్త్రప్రకారం చెప్పినపనిచేయుట. తినుమనిచెప్పిన వస్తువులుతినుట. దీనికి హలాల్ అని పేరు.

హరాంకు - హరాం - జాఁనా

అనగా

శ్రీభగవంతుడు శాస్త్రప్రకారం చెయ్యకూడదని చెప్పిన పనులు చెయ్యడము, తినకూడదని చెప్పినవస్తువులు తినడము, దీనికి హరాం అనిపేరు.

(6) ఖుదాయె-త-ఆలాకే - అజాబ్ సె - డర్ నా

అనగా

శ్రీభగవంతుడు మనలను శిక్షించును అని భయపడుట.

(7) రహమత్ కే - వుమ్మీద్ - వార్ - రహనా

అనగా

దేవునియొక్క అనుగ్రహమును కోరుచుండవలసినది.

——(*)——

మస్‌లా అనగా సవాల్.

హుమ్ మాన్ - ఇమాన్ కే - సాత్ హిన్

అనగా

విశ్వాసముయొక్క ఉత్తరువులు ఏడు.

పాన్‌చ్ కు దునియాసె యిలాఖా - దోకు ఆఖరత్ సె

ఈక్రింద వ్రాయబడిన ఐదుమాత్రం యిహలోకముతో సంబంధము కలిగివున్నవి. మిగత రెంటికి పరలోకసంబంధము కలదు.

(1) ఇమాన్‌దార్ కు నాహక్ మార్ నడాల్ నా

అనగా

భక్తుని అక్రమముగా చంపకూడదు.

(2) ఇమాన్‌దార్‌కు ఖైద్‌నకర్‌నా

అనగా

భక్తుని బందిఖానాలో వేయకూడదు.

(3) ఇమాన్‌దార్‌కామాల్ నాహక్ నలేనా

అనగా

భక్తునియొక్క సొత్తును అక్రమముగా అపహరించకూడదు.

(4) ఇమాన్‌దార్‌కు ఖిలాపేషరా ఇజాన దేనా

అనగా

భక్తునికి కష్టముగాని లేక దుఃఖముగాని న్యాయశాస్త్రమునకు విరోధముగా కలిగించకూడదు.

(5) ఇమాన్‌దార్‌పర్ గుమాన్‌నె బద్ - న-లేజానా

అనగా

భక్తునియందు చెడ్డఅనుమానం వుంచకూడదు.

---:0:0:---

ఆఖరత్‌సె - యిలాఖ - రక్‌తెహీన్‌సో - దో-హాలతుం-యేహీం

అనగా

పరలోకముతో చేరిన రెండువుత్తరువులు యేవనగా

(1) ఓషక్స్‌కె - ఇమాన్-లావె - అజాబె-దోజక్‌సె-హామేషా ఖలాసిపావె

అనగా

ఏమనుజుడైతె నరకమువున్నదని నమ్ముతాడో అటువంటివాడు యెల్లప్పటికి విముక్తుడైవుంటాడు.

(2) దుస్రా - యోకెజాయె - ఫుస్కె-జన్నత్ మెహోవె

అనగా

పైనచెప్పిన మనుష్యునియొక్క నివాసము స్వర్గముగావుండును.

——):o:(——

మసలా అనగా సవాల్.

ఇమాన్ ఫరజ్ హోనేకె దో షర్తెహైన్

అనగా

విశ్వాసము విధాయకము అని చెప్పుటకు రెండుకారణములు కలవు.

(1) పహిలె షరత్ ఆఖిల్ హెూనా

(2) అవాల్ బాలెగ్ హోనా

అనగా

మొదటిది—జ్ఞానము కలిగివుండుట.

రెండవది—యుక్తవయస్సు కలిగివుండుట.

——(o):(o)——

మస్లా అనగా సవాల్.

వాజిబాత్ - ఇమాన్ కే బారాహైన్.

అనగా

విశ్వాసమునకు అవశ్యకమైనవి 12 సంగతులువున్నవి.

(1) పహిలా వాజిబ్ సోహబత్ వుల్మా వోన్ సె రక్నా

అనగా

పండితులతోను, పెద్దలతోను యెల్లపుడు సాంగత్యము కలిగి వుండవలసినది.

(2) పాశిక్ అవుర్ బద్‌కా రోగ్‌సె దూర్ రహానా

అనగా

పాపాత్ములతోను చెడ్డవారితోనున్ను చేరక దూరముగా వుండవలసినది.

(3) ప్యాసేకు పాని పిలానా

అనగా

దాహము కలిగినవారికి నీళ్లు యివ్వవలసినది.

(4) బీమార్‌కు పూచ్‌నె జానా

అనగా

రోగిని విచారించుటకు పోవలసినది.

(5) వాస్తెఖుదాకె దుర్‌వీషకు పూచ్‌నా.

అనగా

శ్రీభగవంతునికొరకై సన్యాసులను విచారించవలసినది.

(6) ఉపర్ సర్ యతిమోంకె హాత్ షఫ్‌ఖత్‌కా ఫేరానా

అనగా

తల్లితండ్రిలేని బిడ్డశిరస్సుయందు తనహస్తమును వుంచి ప్రేమించవలసినది.

(7) సాత్‌వాక్ వాజిబ్ జిక్‌దోపర్‌హై ముర్‌దేకు గుసుల్ దేనా

అనగా

బ్రతికివుండువారు చనిపోయినవానికి స్నానము చేయించవలసినది.

(8) దోషక్స్ లడ్‌తె రహేంతో వుక్‌కు మిలాదేనా

అనగా

ఇద్దరు కొట్లాడుతూవుంటె వాండ్లను సమ్మతిపరచవలసినది.

(9) రాస్తెమె పథర్ అవుర్ కాంటె హెూతో కినారె కర్నా

అనగా

దారిలో రాళ్ళు ముండ్లువగైరా వున్నయెడల తొలగించవలసినది.

(10) రాస్తేమె నజాసత్ హెూతో ఢాంప్ దేనా

అనగా

దారిలో మలమూత్రములు మొదలైన అసహ్యాకరమైన వస్తువులున్న యెడల వాటిని కప్పిపెట్టవలసినది.

(11) వాస్తె అల్లాహాకె దుర్వీష్‌పర్ షఫ్ఖత్ కర్నా

అనగా

శ్రీభగవంతునికొరకై సన్యాసులయెడల దయచూపవలసినది.

(12) అహాలో అయాల్‌కు అప్‌నెఇలమ్ షరీయత్ కా సికానా

అనగా

తనకుటుంబీకులకు తనమతశాస్త్రమును నేర్పవలసినది.

——(*)——

మసలా అనగా సవాల్.

ఖాయంహెూనే ఇమాన్‌కె కెతెనె చీజ్ హైం.

అనగా

ఎన్నివస్తువులవల్ల విశ్వాసము ఖాయముగా వుంటున్నది.

తీన్ చీజ్ హైం

అనగా

మూడువస్తువులతో ఖాయముగా నిలుస్తున్నది.

(1) అవ్వల్ - ఇమాన్ - పానేసె - ఖుష్‌హెూనా

అనగా

మొదటిది—విశ్వాసము కలిగినందుకు సంతోషపడవలసినది.

(2) దుసరా - ఇమాన్ కె - జానేసె - డర్ నా

అనగా

రెండవది—విశ్వాసము తొలిగిపోకుండా భయముగానటించవలెను.

(3) తీస్ రా-వున్‌చీజోఁసె డర్ నా-జోఁకె ఇమాన్ కు తబాహః
కర్ తేహీన్ అనగా

మూడవది—ఏవస్తువులవల్ల విశ్వాసము చెడిపోతూవున్నదో ఆవస్తువులకు భయపడుతూ వుండవలసినది.

——):o:(——

మస్‌లా అనగా సవాల్.

అసలె-ఇమాన్-క్యాహై అనగా విశ్వాసమునకు మూలమేది.
ఆతామె బారేత - ఆలా అనగా దేవునియొక్క ఆశీర్వాదము.

——(o):(o)——

మసలా అనగా సవాల్.

సరె - ఇమాన్ - క్యాహై

అనగా

విశ్వాసమునకు ఫలము లేక శిరస్సుయేది.

కల్‌మయ్యె - తయ్యబ్ - పడనా

అనగా

ఈపరిశుద్ధమైన మహావాక్యము చదవడము.

లా-ఇలాహ - ఇల్‌లల్‌ల్లాహు - మహమ్మదర్ -రసూలుల్ ల్లాహీ

అనగా

ఈమహావాక్యముయొక్క అర్థము మహమ్మదీయన్ మతస్థులందరు నీతెరంగున ఏకాభిముఖముగా నమ్మియున్నారు. శ్రీసృష్టికర్త

తప్ప యితరదైవములేదు హజరత్ సయ్యదినా మహమ్మద్ అనువారు శ్రీదేవునివలన పంపబడినవారు.

——:0::0::0:——

మస్‌లా అనగా సవాల్.

దిల్ - ఇమాన్‌కా - క్యాహై

అనగా

విశ్వాసముయొక్క హృదయము యేది.

ఖుర్ఆన్-నె - షరీఫ్‌కా - పడనా

అనగా

పరిశుద్ధమైనవేదము అనగా ఖుర్అన్‌నెషరీఫ్ చదవడము.

సవాల్—నూరె ఇమాన్ క్యాహై అనగా విశ్వాసమునకు కళఏది!

జవాబ్—సచ్‌బోల్‌నా అనగా సత్యముచెప్పుట.

సవాల్—తారికియె ఇమాన్ క్యాహై అనగా విశ్వాసమునకు అంధకారము యేది!

జవాబ్—ఝూట్‌బోల్‌నా అనగా అబద్ధము చెప్పడము.

సవాలు—తంగియె ఇమాన్ క్యాహై అనగా విశ్వాసముకు నిర్బంధము యేది.

జవాబ్—నమాజ్ పడనా అనగా 5 వేళలయందు నమాజ్ చెయ్యడము.

సవాలు—హలావతె ఇమాన్ క్యాహై అనగా విశ్వాసమునకు మాధుర్యమేది.

జవాబ్—హమేషా పాక్ - రహనా అనగా ఎల్లప్పుడు శుద్ధిగా వుండవలసినది.

సవాలు—బరకతె ఇమాన్ క్యాహై అనగా విశ్వాసముయొక్క

ఆశీర్వచనము ఏది.

జవాబ్—అల్లాకా జికర్ కర్నా అనగా దేవునిధ్యానముచెయ్యడం

సవాలు—మొఖామె ఇమాన్ కహాన్ హై అనగా విశ్వాసముయొ

క్క స్థానముయేది.

జవాబ్—అల్ - ఇమానో - బైనల్ - ఖౌపె - వర్జ్రా

అనగా

విశ్వాసము ఆశకున్ను భయముకున్ను మధ్యవుంటున్నది.



పసల్ ధూస్రి బినాఇస్లామ్కె పాంచ్ఫర్జోన్కె బయాన్మె

అనగా

రెండో అధ్యాయము, ఆదిలోకలిగిన ఇస్లామ్యొక్క ముఖ్యమైన

ఐదు నిబంధనలను గురించి.

(1) కల్మయే షహాదత్ పడనా

అనగా

ఈమహావాక్యము మనోనిశ్చయముతో చదువుట.

అష్హదుఅన్ - లాఇలాహా - ఇల్లల్లాహు - వహదహూ

లాషరీకలహూ - వఅషహదు - అన్న - మొహమ్మదన్ - అబ్దుహూ - వ

రసూలుహూ ॥ అనగా

ప్రమాణముగా వచించుచున్నాను. శ్రీభగవంతుని కంటె

ఇతరదైవములేదు.

ప్రమాణముగా భాషింపుచున్నాను. హజరత్ సయ్యదినా మొహమ్మదుగారు శ్రీభగవంతునివల్ల పంపబడినవారే ॥

2వది నమాజ్ అనగా దేవునిప్రార్థన.

3వది రోజా అనగా ఉపవాసము.

4వది జకాత్ అనగా ధర్మము.

5వది కాబేషరీఫ్ కా హజ్ కరనా అనగా మహాస్థళముయొక్క యాత్రచేయుట.

సవాలు—దీన్ కిస్‌కు కహతేహీఁ

జవాబ్—మజ్‌హబ్, ధరం, ఇమాన్

అనగా

మతము లేక విశ్వాసము.

సవాలు—షరీఅత్ కిస్‌కు కహతేహీఁ

జవాబ్—దీనీఖానూన్, ఇన్‌సాఫ్, తరీఖా

అనగా

మహమ్మదీయులయొక్క నిబంధనలు లేక చట్టము.

——:0:0:——

మసలా అనగా సవాల్.

షరీఅత్‌కె వాజిబాత్ కెతినెహీఁ అనగా సాత్‌హీఁ

అనగా

నిబంధనలయొక్క అవశ్యకమైనపనులు ఏడువున్నవి అవియేవనగా.

(1) కాబేషరీఫ్‌కా హజ్‌కరనా అనగా మహాయాత్ర చేయడము.

(2) మాఁ - బాప్‌కె - ఖిద్‌మత్ - కర్‌నా అనగా తల్లితండ్రులకు సేవచేయడము.

(3) అపురత్ - అప్‌నె - ఖావింద్‌కి - తాబేదారీ - కర్‌నా

అనగా

భార్య భర్తకు సేవచేయడము.

(4) రంజానెషరీఫ్ నెలలో ఖుదుబాదినము ఫితర్‌కా సద్‌ఖా దేనా అనగా ధర్మముయివ్వడము.

(5) ఖుర్బాని కర్‌నా అనగా యజ్ఞముచేయడము లేక బలియివ్వడము.

(6) వితరీకి నమాజ్ పడనా అనగా ప్రతి రాత్రి వితర్‌యొక్క ప్రార్థనచేయడము.

(7) నఫ్‌ఖా దేనా అనగా తనకుముఖ్యమైన బంధువులకు దానముచేయడము.

---

సవాల్ — సున్నత్ కిస్‌కు బోల్‌తేహిఁ

జవాబ్ — హజరత్ సయ్యదినా మొహమ్మదు స్వల్‌లల్లాహు అలైహి వసల్‌లమ్‌కె ఖౌల్, అపుర్, ఫెల్‌కు

అనగా

హజరత్ సయ్యదినా మొహమ్మదుగారుచెప్పిన వాక్యమున్ను చేసినపనిని సున్నత్ అని పిలువబడును.

ఇస్‌లామ్‌కె ఆట్ సున్నత్‌హిఁ

అనగా

ఎనిమిది సున్నతులు వున్నవి.

(1) ఖతనా కర్‌నా అనగా మొహమ్మదీయులు లింగముచివర చర్మమును ఛేదించడము.

(2) దాడీ రఖనా అనగా మొహమ్మదీయులు దాడీక అది ప్రమాణమును అ

(3) లబేక్ లేనా అనగా మీసములు ప్రమాణమును అనుస రించి వుంచడము.

(4) నాకేూ బాల్ లేనా అనగా నాసికములో వెంట్రుకలను తీసివేయడము.

(5) హాత్ - పాప్ఁక్ కె - నాఖున్ లేనా

అనగా

కాళ్ళవేళ్ళయొక్క, చేతులవేళ్ళయొక్క గోళ్ళుతీయించడము.

(6) సాకెసర్ కె - బాల్ రఖనా - యా - ముండానా

అనగా

శిరస్సునందు ప్రమాణమును అనుసరించి వెంట్రుకలను తీసి వేయడముగాని లేక వుంచడముగాని

ఇందులో తెలుసుకొనతగ్గ గొప్పరహస్యమువున్నది. మహ మ్మదీయస్త్రీలలో ముఖమందు అలంకారముకొరకు వెంట్రుకలను తీయింతురు. ఇది గొప్పపాపము గనుక ఆపనిని చేయకూడదు. అటులచేయు ఆడవారికి శ్రీభగవంతునియొక్క ఆశీర్వాదము కలుగ నేరదు.

(7) బగలోంకె - బాల్ - లేనా

అనగా

చంకలలోవుండు వెంట్రుకలను తీసివేయవలయును.

(8) జేరే - నాఫ్ కె - బాల్ - నికాల్ నా

అనగా

మర్మస్థళమందు వెంట్రుకలను తీసివేయుడము.



తీసరీ ఫసల్ ఖుదాయె తఆలాపర్ ఇమాన్‌లానేకే బయాన్‌మే

అనగా

## మూడో అధ్యాయము, శ్రీదేవునియందు విశ్వాసమును గురించి.

మొహమ్మదీయులు దేవునియందు యెటువంటినమ్మకము వుంచి నారనగా సర్వశక్తిగల భగవంతుండొకడేను, అతనికి జన్మములేదు. ఇతరసహాయములేదు, తల్లితండ్రులులేరు, అతనికి సమానమైనదేవుడులేడని నమ్మవలెను.

ఇందుకు సర్వశక్తిగల శ్రీభగవంతుని విషయమై పరిశుద్ధమైన మొహమ్మదీయుల ఖురానెషరీఫ్‌లో నిత్తేరంగున వ్రాయబడివున్నది. దానిని మొహమ్మదీయ శాస్త్రములో 'దలీల్' అని పిలువబడును.

ఉదాహరణము.

ఖుల్ - హువల్లాహు - అహద్ - అల్లా - హుస్-స్సమద్ లం - ఎలిద్ - వలం - యూలద్ - వలం - యకున్ - లహు కుఫ్‌వన్ - అహద్ ॥ అనివ్రాయబడినది చూడుడు.

———(*)———

మసలా అనగా సవాల్.

. సిఫ్తేకె-ఖుదాయెతఆలాకే - ఖదీంహీన్ - ఉస్‌పర్‌భి - ఇమాన్‌లావె

జాత్ అనగా బ్రహ్మస్వరూపము

సిఫాత్ అనగా అతనిగుణములు,

అట్టిభగవంతునియందు అతని కల్యాణగుణములయందు మనము మి క్కిలి విశ్వాసకరముగా నడుచుకోవలెను.

శ్రీభగవంతుని అనంతకల్యాణ గుణములను సంగ్రహముగా వ్రాయచాలను, అయినను ప్రధానములైన యేడుగుణములు యీ క్రింద వ్రాయబడుచున్నవి.

1 హైయున్, 2 అలీమున్, 3 ఖాదెరున్, 4 మురీదున్
6 ముతకల్లెమున్, 6 సమీవున్, 7 బశీరున్

(1) హైయున్ అనగా స్వేచ్ఛగాజీవించువాడు.

(2) అలీమున్ అనగా సర్వజ్ఞుడు.

(3) ఖాదెరున్ అనగా సర్వశక్తిగలవాడు.

(4) మురీదున్ అనగా కోరకనే కోరికెలను చెందువాడు.

(5) ముతకల్లెమున్ అనగా వాగింద్రియములేకనే మాటలాడువాడు.

(6) సమీవున్ అనగా చెవులులేకనే దూరశ్రవణముగలవాడు.

(7) బశీరున్ అనగా కండ్లులేకనే ప్రపంచమంతయు చూచువాడు.

శిఫాతుహు - ఖదీమతున్ - బాఖీయ్యాతున్ - యానే సిఫ్‌తాన్ అల్లాహకె - ఖదీమ్ - అవ్వల్ - బాఖీహిన్ ॥

అనగా

శ్రీభగవంతుని అనంతకల్యాణ గుణములు ఆయనవలె సత్యముగా నుండునట్టివి.

---

ఫసల్ చవుథి - ఫరిష్తోంపర్ ఇమాన్‌లానేకె బయాన్ హె

అనగా

4గో అధ్యాయము దేవదూతలయందు యీవిధముగా విశ్వాసమును వుంచవలయును. పైదేవదూతలు నూర్ అనగా తేజస్సుచేత శ్రీభగవంతునివల్ల సృజింపబడినవారు.

ఇన్సాన్ అనగా మానవులు. పృథివీతత్వమువల్ల సృజింపబడినవారు జిన్నాత్ అనగా రాక్షసులు, అగ్నివల్ల పుట్టింపబడినవారు.

పైనచెప్పబడిన దేవదూతలలో ముఖ్యమైనవారు నలుగురుగా నుంటున్నారు.

(1) హజరత్ జిబ్రాయిల్ అలైహిస్సలామ్.

(2) హజరత్ మీకాయిల్ అలైహిస్సలామ్.

(3) హజరత్ ఇస్రాఫీల్ అలైహిస్సలామ్.

(4) హజరత్ ఇజ్రాయిల్ అలైహిస్సలామ్.

(1) హజరత్ జిబ్రాయిల్ అను దేవదూత శ్రీభగవంతుని అనుజ్ఞచే వేదములను పైగంబర్లు అనగా ప్రవక్తలయొక్క సన్నిధానమునకు తెచ్చినవారుగానున్నారు.

(2) హజరత్ మీకాయిల్ అను దేవదూత వర్షమును కలుగ చేయుచు సమస్తలోకమును రక్షించుచున్నాడు.

(3) హజరత్ ఇస్రాఫీల్ అనుదూత వాయువును కలుగచేయుచు ఒకవిధమైనధ్వని సాధనమును ధరించి అనగా సూర్ అనుదానిచే శ్రీభగవంతుని అనుజ్ఞనుపొంది ప్రపంచప్రళయమును హెచ్చరిక చేయుటకు కాచియున్నారు.

(4) హజరత్ ఇజ్రాయిల్ అనుదూత సర్వజీవుల ప్రాణములను హరించుచున్నాడు,

పైనుదహరించిన దేవదూతల చరిత్రలనుగురించి గొప్ప గ్రంథములు అనగా (తక్మీలుల్-ఇమాన్, శిరాతుల్-ఇస్లామ్) అను గ్రంథములు మొదలైనవాటిని చదువగా తెలియనగును.

ఫసల్ పాంచ్‌వీఁ-కితాబోఁపర్ ఇమాఁలానేకె బయాఁమె

అనగా

**5**వ అధ్యాయము. శ్రీభగవంతునివల్ల పంపబడిన పుస్తక

ములయందు విశ్వాసము వుంచవలయుననుట.

శ్రీభగవంతునివల్ల మహాఘనతజెందిన పైగంబరులనే ప్రవక్త లకు పంపబడిన పుస్తకములు నూటనాలుగు, అందులో ముఖ్యమైన పుస్తకములు నాలుగు. అవియేవనగా :—

(1) జబ్బూరెషరీఫ్ - హజరత్ దావూద్ అలైహిస్సలామ్.

(2) తౌరేతెషరీఫ్ - హజరత్ మూసా అలైహిస్సలామ్.

(3) ఇంజీలెషరీప్ - హజరత్ ఈసాఅలైహిస్సలామ్.

(4) ఫుర్ఖానెషరీప్ - హజరత్ సయ్యిది - ఖాతెముల్ అన్బియా మొహమ్మద్‌దీఁ స్వల్ లల్లాహు అలైహి వసల్లమ్.

మిగిలిన చిన్నపుస్తుకములను "సహీఫె" అని చెప్పబడును అవి హజరత్ ఆదం అలైహిస్సలామ్, హజరత్ ఇదిరీస్ అలైహిస్సలామ్ హజరత్ షీష్‌అలైహిస్సలామ్, హజరత్ఇబ్రాహీం అలైహిస్సలామ్

ఈమొదలైనవి అన్నిపుస్తకములయందు యెవడు అవిశ్వాసముతో నడుచుకొనునో వాడు "కాఫర్" అనగా మతభ్రష్టుడు అని పిలువబడును.

——:0:0:——

ఫసల్ ఛెట్‌టి - పైగంబరోఁపర్ ఇమాఁలానేకె బయాఁమె

అనగా

**6**వ అధ్యాయము పైగంబరులనే ప్రవక్తలయందు మనము

ఏలాటి విశ్వాసము వుంచవలెననగా.

శ్రీభగవంతుడు మనకు మంచిదారి చూపుటకు పైగంబరులను పంపియున్నారు. వారు మనకు ఏమేమార్గములు చూపియున్నారో ఆమార్గమును మెచ్చి నమ్మవలెను. అందువల్ల మనకు ఇహపర సౌఖ్యములు కలుగును. వారు స్వతః పరిశుద్ధులుగావుండి పాపమునకు దూరస్థులుగా వున్నారు.

ఈలోకములో శ్రీభగవంతుడు సర్వమానవుల సృష్టిచేయు నపుడు "హజరత్ - ఆదం - అలైహిస్సలామ్" అనువారిని మొదటి పైగంబరుగా సృజించినారు. వీరు యీలోకమందలి సర్వమానవులకు ప్రధానపితరుడుగా వున్నాడు

కడాపట మన "హజరత్-ఖాతెముల్ - అంబియా-సయ్యదినా వఫియ్యునా - మొహమ్మదుగారిని" శ్రీభగవంతుడు వీరిపైన పైగంబరులేడు వీరితోనె అంత్యమైనదని వచించియున్నారు.

ఇదిగాక శ్రీభగవంతుడు సమస్తమైన పైగంబరులయొక్క సంఖ్యను యీలోకములో పైగంబరుల సంఖ్య 1,24,313 గా తెలియబడుతున్నది, తక్కినసంగతి శ్రీభగవంతునికె తెలియును, ఇతరులకు తెలియదు గనుక యావత్తు పైగంబరులయందు మనము విశ్వాసము వుంచవలయునని తెలిసేది. ఇది ఇస్లామ్‌యొక్క విశ్వాసము.

——(o):(o)——

ఫసల్ సాత్‌వీఁ - రోజె - ఖియామత్ పర్ - ఇమాన్‌లానేకె

బయాఁమె　　　　అనగా

**7డో అధ్యాయమునందు పునరుత్థానమునందు విశ్వాసము ఎట్లవుంచవలెననగా :—**

పునరుత్థానము వచ్చేతీరుతున్నది అందుకు సందేహములేదు. వాటియొక్క చిహ్నములు అనేకములువున్నవి. అందులో ముఖ్యమైనవి నేను మనవిచేయుచున్నాను.

పునరుత్థానము సమీపించినప్పుడు జగత్తునందు పాపమునిండి పోవును చేవునియందుభక్తిన్ని వేదములయందు విశ్వాసమున్ను తప్పిపోవును. ఆకాలమందు భగవంతుడు వక అవతారపురుషుని పుట్టించును వారియొక్క పేరు 'హజరత్ ఇమామె మహదిఅలైహిస్సలామ్' అని చెప్పుదురు.

ఆకాశవాణివల్ల సదరు మహనీయులుచేయు వృత్తర్వులకు లోపడి నడుచుకోవలసినదిగా ఒకధ్వనికలుగును. ఇంకా అనేకములు వున్నవి వాటిని యీచిన్నపుస్తకములో వ్రాయశక్తుడనుకాను.

ఇందునుగురించి విశేషముగా "తక్మీలుల్ ఇమాన్, శిరాతుల్ ఇస్లామ్" అను పుస్తకములలో వ్రాయబడేవున్నది. వాటినవలోకించినయడల తెలియును.



ఫసల్ ఆట్విన్ - గునాహె కబాయల్ కె బయాన్ మె

అనగా

8వో అధ్యాయము గొప్పపాపముల విషయమై చెప్పబడివున్నది.

ఇందులో రెండువిధముల పాపములున్నవి అవియేవనగా:—

(1) గునాహెకబీరా | (2) గునాహేసగీరా

గునాహెసగీరా అనగా ధర్మమువల్ల పాపరహితుడవును.

గునాహెకబీరా అనగా ప్రాయశ్చిత్తము.

ఏమనుజుడైతే తానుచేసినపాపములను గురించి తౌబా అనగా పశ్చాత్తాపము పడుటవల్ల పైనచెప్పిన "గునాహేకబీరా" యను పాపము క్షమించబడును.

(1) ఖూనె - నాహఖ్ కర్నా అనగా నిష్కారణముగా నొకని చంపుట.

(2) మాఁబాప్‌కు ఇజాదేనా అనగా తల్లిదండ్రులకు ఆయాసముయిచ్చుట.

(3) జినాకర్‌నా హరాంకర్నా అనగా వ్యభిచారము చేయుట.

(4) యతీమోంకామాల్ ఛీన్నా అనగా తల్లిదండ్రులు లేని వారిఆస్తిని అపహరించుట.

(5) మరద్‌వాలి - అవురత్‌పర్ - జినాకి - తోహమత్ కర్నా అనగా.

భర్తవుండుస్త్రీపైన వ్యభిచారముయొక్క నింద్యమోపుట.

(6) అవురత్-వాలె మరద్‌పర్ జినాకి తోహమత్ కర్నా అనగా

భార్యగల పురుషునియందు వ్యభిచారదోషము మోపుట.

(7) నిషా అనగా కైపు మత్తుతోనుండుట.

(8) బ్యాజ్‌ఖానా అనగా వడ్డీతీసుకొనుట.

(9) రుష్వత్‌లేనా అనగా లంచముయిచ్చుట తీసుకొనుట.

10 రంజానె - షరిప్‌మె - జేడజర్ - రోజా - న - రఖ్నా అనగా

రంజాన్‌నెలలో నిష్కారణముగా వుపవాసము విడుచుట.

11 కీస్పీపర్ - జులుమ్ - నకర్నా అనగా యెవరిపైనను జులుం చేయుట.

12 గైబత్ అనగా కొండెములు చెప్పుట వినుట.

13 అపనేకు దూసరోంసె అచ్ఛాజాన్నా అనగా వకరికన్న తాను జాస్తిఅని యెంచుట.

14 వఅదేకు వాఫా నకర్నా అనగా వాగ్దత్తముతప్పుట.

15 గైర్ - అవురత్ - పర్ - నజరె - బద్ - న - కర్నా

అనగా

పరస్త్రీలయందు చెడ్డచూపుచూచుట.

16 అమానత్మె ఖియానత్ కర్నా అనగా విశ్వాసఘాతము చేయుట.

17 ఖుదాయెత ఆలాకె ఫరజ్ బేవుజుర్ తరక్ కర్నా

అనగా

శ్రీభగవంతుడు చేసినవృత్తర్వును కారణములేకుండా మీరుట

18 హరాం ఫేల్జాణ్కె కర్నా అనగా చెడ్డపని అని తెలిసి చేయుట.

19 ఖురాణ్ - పడ్కర్ - భూల్జానా అనగా వేదముచదివి మరిచిపోవుట.

20 గవాహీ హఖ్బాత్కి నదేనా అనగా నిజమైనసంగతితో సాక్ష్యంయివ్వకుండుట.

21 ఝూటిగవాహీ దేనా అనగా అబద్ధము సాక్ష్యంపలుకుట

22 బేసబబ్ ఝూట్ - బోల్నా అనగా నిష్కారణముగా అబద్ధముపలుకుట.

23 బేవుజుర్ జుమాకి నమాజ్ తరక్ కర్‌నా అనగా నిష్కారణముగా శుక్రవారంనాడు నమాజ్ చేయకుండుట.

24 జాలిమోంకె ఖుషామద్ కర్‌నా అనగా అన్యాయస్థులకు ముఖస్తుతిచేయుట.

25 ఖజియా నాహఖ్ ఫైసలా కర్‌నా అనగా అన్యాయముగా తీర్పుచేయుట.

26 తోల్‌నేమె - యా - మాప్‌మె - కమోజాయద్ - కర్‌నా అనగా

కొలతలో, తూకంలో హెచ్చుతక్కువ తక్కువచేయుట.

27 లడ్‌కోంసె - లివాతత్ - కర్‌నా అనగా పిల్లకాయలతో సంభోగముచేయుట.

28 హైజ్‌కి-హాలత్‌మె - అప్‌ని - జోరూసె సొహబత్ కర్‌నా అనగా

తనభార్య ఋతుస్రావముగా నుండునప్పుడు సంభోగించుట.

29 జిక్‌సా - గల్లా - గిరాక్ - హోనేసె - ఖుష్ - హోనా అనగా

ఏవస్తువుయొక్కగాని, ధాన్యముయొక్కగాని ధరలుజాస్తి అయితే సంతోషించుట.

30 తక్‌హాయిమె గైర్‌అవురత్-కే-మరద్ యేక్‌జాగామె రహానా అనగా

పరస్త్రీతో తాను వంటరిగానుండుట.

31 జాన్‌వరోంసె జిమాకర్‌నా అనగా చతుష్పాత్తు జంతువులతో వ్యభిచారముచేయుట లేక భోగించుట.

32 జువ్వా-ఖేల్నా అనగా జూదమాడుట,

33 నుజూమీకి బాత్ సచ్‌జాన్నా అనగా జ్యోతిషము చెప్పే వారియందు విశ్వాసము వుంచుట,

34 అపని - ఇబాదత్ కా - దావా కర్నా అనగా తానుచేయు ఆచారము, శ్రీభగవంతుని ప్రార్థన, వీటినిగురించి గర్వపడుట,

35 ముర్‌దేకే లియె - చిల్లాకే రోనా - అవ్వార్ - పీట్‌నా అనగా

గతించినవానికిగాను గట్టిగాఏడ్చుట, కొట్టుకొనుట,

36 ఖానేకె ఛీజాంకు బురె-కహనా అనగా తినేపదార్థముల యందు దోషారోపణచేయుట,

37 నాచ్ - దేక్‌నా అనగా నటనముచూచుట,

38 సాజోంసె రాగ్ సున్నా అనగా వాద్యములతోపాటవినుట

39 దిఖానేకు ఇబాదత్ కరనా అనగా శ్రీభగవంతుని ప్రార్థనలో కపి డంబముగా చేయుట.

40 కిసీకె ఘర్‌మె బేయిజాజత్ జానా అనగా ఎవరియింటిలో వుత్తర్వులేనిదె పోవుట.

41 ఖుదరత్ - హెూతేపర్ - కిసీకు - అవామిరో - నవాహీసె ఆగాహ్-న-కర్నా అనగా

శక్తివున్నప్పుడు ధర్మమును తెలియచేయకుండుట.

42 కిసీకు - మస్‌ఖరీసె - బేహుర్‌మత్ - కరనా

అనగా

యేవరికి అవుమర్యాద హేళనచేయుట.

43 ముసల్మాఁ మె నాహఖ్ ఝుగడ్నా అనగా భర్తునితో అన్యాయగా కలహించుట.

44 కోయి జాఁ దార్కు ఆగ్ మె జలానా అనగా జీవముగల జంతువులను అగ్నిలో వేయుట.

45 జోరూ నాఫర్మాని మరద్కి కరనా అనగా భార్య తన భర్తకు అవిధేయతగా నడుచుట.

46 మరద్ జోరూపర్ జులుమ్ కరనా అనగా భర్త భార్య యందు అక్రమము చేయుట.

47 బాద్షాసె కిసికి చోగ్లి బోల్నా అనగా రాజులతోను గొప్పవారితోను కొండెములు చెప్పుట.

48 జోరుమరద్మె ఝుగడా కర్వానా అనగా భార్యభర్తలకు కలహంపెట్టుట.

49 ఆలిమోంమె _ ఝుగడా - కర్వానా అనగా పండితులలో మహనీయులలో కలతలుపెట్టుట.

50 హాఫీజోఁకి - యహనత్ - కరనా అనగా ఖురానెషరీఫ్ కంఠోపాఠముగా చదివినవారికి హేళనచేయుట.

51 జ్యాదు కరనా అనగా తోడుపోతుచేయుట.

52 నాహఖ్ బాతోఁపర్ గుస్స్సాహోనా అనగా అన్యాయ మునకుగాను కోపించుకొనుట.

53 కిన్కె - అయబ్కె - దర్పైహోకర్ - అపనే - అయబ్పర్ నజర్ - న - కర్నా అనగా ఇతరుల లోపములను బైటపెట్టుట, తనలోపమును దాచుట.

54 బుజురుగ్గోఁ పర్ బద్ గుమానీ కరనా అనగా పెద్దలయందు
చెడ్డతలంపు వుంచుట.

55 ఇలమ్ పడ్ కె అమల్ న-కర్ నా అనగా విద్యనేర్చుకొని
ఆమేరకు నడుచుకొనకయుండుట.

56 ఆలిమోఁ కి హీఖారత్ కరనా అనగా పండితులను అసూ
యతతో చూచుట.

57 పెషాబ్ - యా-పైఖానేకి - పాకి - ఖూబ్ - న-కరనా
అనగా
మలమూత్రములయొక్క శుద్ధిచేయకుండుట.

58 దాడి ముక్ డ్వానా అనగా గడ్డము క్షవరముచేయించుట.

59 జనాబె రిసాలత్ మఆబ్ హజరత్ సయ్యదినా మొహమ్మ
దిఁ స్వల్లల్లాహు అలైహీ వ-అలిహీ వసల్లమ్ కా నామె ముబా
రక్ సుఁకర్ దురూదెషరీఫ్ న-పడనా
అనగా
హజరత్ సయ్యదినా మొహమ్మదుగారిపేరు వుచ్ఛారణ చేసి
నప్పుడు నమస్కరించకుండుట.

పైచెప్పిన పాపకార్యములు గునాహెకబీరాలో చేరుతున్నది.



ఫసల్ - నావిఁ - కుఫర్ కె - సబబోఁ కె - బయాఁ మె
అనగా
**9దో అధ్యాయము—అవిశ్వాస విషయమును గురించి**

అవిశ్వాసముగల కొన్ని సంగతులు వ్రాయుచున్నాను.

(1). ఖుదాయెత ఆలాకు జిసంవాలా-యా-రంగ్‌వాలా-జాన్నా
అనగా
దేవుడు మనతరహాగా పుట్టినాడనిన్ని మనవలెనే శరీరమున్ను రంగున్ను వున్నదని, ఆకాశమునందు వున్నాడని వకస్థళమును నిర్ధారణ చేసుకొని వున్నాడనిన్ని యెంచుట.

(2) సచ్చేబాతోఁకు ఝుటలానేకెలియె ఖుదా షాహెంద్‌హై కర్కర బోల్‌నా అనగా
మాటమాటకు దేవుని సాక్ష్యముగా చెప్పుతాననుట,

(3) ముసీబత్‌కె వాఖత్ ఖుదాకు గాలియాఁ దేనా అనగా
మనకు ఆపత్తువచ్చినప్పుడు దేవుని దూషించుట.

(4) ఖుదాయా తూ సొబ్ కుచ్ ఛీఁలియా అనగా దేవుణ్ని
మాకువుండిన సొత్తులను నీవేతీసుకొన్నావు అనుట.

(5) తుజె క్యా-ఇఁసాప్-థి జో-అఇుసా-కియా అనగా నీకు
ఏమిన్యాయమనితోచి యిట్లుచేసినావని దూరాడుట.

(6) ఖుదానె క్రైసీ బే-ఇఁసాప్-కియా కర్కర్ బోల్‌నా అనగా
దేవుడునీయందు యంతఆన్యాయము చేసినాడనిచెప్పుట.

(7) ఖుదాయ-త ఆలా మేరాహఖ్ ఛీనాహై అనగా శ్రీభగ
వంతుడు నాహక్కు-నుతీసినాడు అని చెప్పుట.

(8) ఖురానెషరీఫ్‌కె ఆయితోఁపర్ ఠటోల్ కరనా అనగా
వేదములయొక్క సంగతులను గురించి హేళనచేయుట.

(9) ఖుదాకె తరఫ్‌సె భేజేగయె పైగంబరోఁకె మెహానత్ కరనా యా-బె-అదబికరనా అనగా
దేవునివల్ల పంపబడిన ప్రవక్తలను దూషించుట హేళనచేయుట.

10 పైగంబరోఁకె ఫరమాఁ పర్ గుమాఁ కరనా అనగా ప్రవక్తలుచెప్పు మాటలయందు సందేహపడుట.

11 ఖియామత్ కె అవుర్ వుస్ కి హాలతోఁసె ముశేక్యాకాంహై కర్ కె హీఖారత్ అవుర్ ఠట్ఠోల్ కరనా అనగా ప్రళయకాలములో జరుగుసంగతులు వగైరా గురించి హేళనచేయుట.

12 పాఁచ్ వఖత్ కి నమాజ్ సె సైర్ హెూగయాహుఁ అబ్ హాజత్ పడనేకి నహీఁ అనగా నమాజ్ (అనగా శ్రీభగవంతుని ప్రార్థన) విషయమై 5 వేళల నమాజ్ చేసినట్టేను నాకు జరూరు లేదనియెంచి చేయకుండుట.

13 కిసీకు కాఫర్ కర్ కె కహనా అనగా ప్రతిమనుష్యుని కాఫర్ అని చెప్పుట.

14 సవాబ్ అజాబ్ జన్నత్ సె కామ్ నహీం కర్ కె బోల్ నా అనగా నాకు పాపపుణ్యములు, నరకము, స్వర్గము వీటితో ఏమి పనిలేదని చెప్పుట.

15 హజరత్ ఖాతెముల్ ముర్ సలీఁ సయ్యదిన మొహమ్మదిఁ స్వల్ లల్లాహు అలైహీ వ-ఆలిహీ వ-అస్ హాబెహీ వగైరాకి తౌహీఁ అవుర్ యహానత్ కరనా అనగా హజరత్ సయ్యదినా మొహమ్మదుగారి సహచరులయందును వారిభక్తులయందును, తిరస్కరించుట సందేహించుట.

ఈవగైరా యింకఅనేక గొప్పవిషయములు కొన్నివున్నవి వాటిని యిందులో వ్రాయశక్తుడనుకాను వాటినితెలుసుకోవలయు నను వారు "తక్ మీలుల్ ఇమాఁ, శిరాతుల్ ఇస్ లామ్" అను పుస్తకములో చదివి తెలుసుకోవలెను.

నేను నాసహోదరుల సన్నిధిలో చేతులను మొగిడించుకొని ప్రార్థన చేయునది యేమనగా :—

గునాహెకబీరా అధ్యాయమున్ను కుఫర్‌యొక్క అధ్యాయమును చూచుకొని తమయొక్క విశ్వాసమును కాపాడుకొందురని కేయుంబగలు హజరత్‌సయ్యదినా మొహమ్మదుగారిపైన "దురూదె షరీఫ్" చదువుతు ఈ-దో-అ పఠనచేస్తువుండవలెను.

అల్‌ల్లాహుమ్మ-ఇన్ని - అవుజు బేక - మిన్ - అన్ - వుష్‌రెక - బేక - షైఅన్ - వ-అనా - ఆలము - వస్‌తగ్ - ఫెరోక - లేమాలా ఆలము - ఇన్‌నక - అంత - అల్‌లాముల్ - గుయూబ్ ॥

అనగా

ఓభగవంతుడా నాకు అవిశ్వాసమున్ను గొప్పపాపమున్ను రాకుండా కాపాడవలెనని ప్రార్థించుచున్నాను.

ఈవిషయమై హజరత్ సయ్యదినా మొహమ్మదుగారు యీవిధముగా వచించియున్నారు,

యెవరైతే ఇస్లామ్‌యొక్క దారిని పొందియున్నారో మరియు విశ్వాసముయొక్క రుచి మరిగియున్నారో వారలు తమయొక్క (నజాత్) అనగా మోక్షముయొక్క దారి వెతుకులాడవలెను. అందుకు శ్రీభగవంతుడు సంతోషపడును, ఎంతమట్టుకుసాధ్యమో అంత మట్టుకు పాపములకు దూరస్తులుగావుండి పుణ్యమునకు సమీపములో నుండి శ్రీభగవంతునియొక్క (నమాజ్) అనగా ప్రార్థనలో యుండవలసినది. ఆమనుజుడు ఇమాన్‌లోనున్ను ఇస్‌లామ్‌లోనున్ను ప్రధానుడుగా నుండును.

"అఖాయదె ఇస్లామ్" అను చిన్నపుస్తకమును సమాప్తము చేయకముందు ఈ "దురూదెషరీఫ్" అనగా అల్లాహుమ్మ -సొల్లె అలా - సయ్యాదినా - మొహమ్మదిన్ - వ-అలా - ఆలె - సయ్యాదినా ॥ మొహమ్మదిన్ - వ-బారిక్ - వసల్లిమ్ - అలైహి ॥ అని పఠనచేసి తిరుగా "ఈ దొఆ" అనగా ప్రార్థనను శ్రీభగవంతుని సన్నిధిలో హస్తములుజోడించుకొని ఈక్రిందవివరింపబడిన ప్రార్థనతో ముగింపు చేసినాను.

అల్లాహుమ్మగ్ - ఫిర్లి - వలేవాలె - దయ్యా - వలె - ఉస్తాదియా - వలె - జమీఇల్ - మూమినీనా - వల్ - మూమీనాత్ - వల్ ముస్లేమీనా - వల్ - ముస్లెమాత్ - ఆల్ - అహయాయె - మిన్హుం - వల్ - అంవాత్ - ఇన్నకా - ముజీబుద్ - దావాత్ - యా - ఖాజీ - యల్ - హాజాత్ - బె-రహమతేకా - యా- అర్రహమర్ - రహెమీన్ ॥ ·అనగా

ఓభగవంతుడా, నన్ను నాతల్లిదండ్రులు మొదలగువారిని, నాగురువులను యావత్తుమహమ్మదీయక్ స్త్రీపురుషులను రక్షింపుము. మరియు జీవితులైయున్నవార్లను, మృతిజెందినవార్లనుకూడ రక్షింపుము.

——(o):(o)——

అఖాయదెఇస్లామ్ సమాప్తము.





# బిస్మిల్లా హిర్రహిమా నిర్రహీమ్.

---

## ఫిఖహె ఇస్లామ్

అనగా

మహమ్మదీయులయొక్క మతమునకు సంబంధించిన
ధర్మశాస్త్రమును గురించి.

హందో - నఅత్ కె - బయాన్ మె

అనగా

శ్రీభగవంతుని స్తోత్రమునున్ను మనప్రభువైన హజరత్ సయ్యదినా
మొహమ్మదుగారి స్తుతినిగురించి.

---

బిస్మిల్లా - హిర్రహమా - నిర్రహీమ్.

అనగా

మిక్కిలి. ప్రేమకలిగినటువంటిన్ని అతికరుణాకరుడవైనటు
వంటి నీపరిశుద్ధమైన నామముతో ప్రారంభించుచున్నాడను.

ఓభగవంతుడా నీనామము ఎంతో మధురముగా నున్నది.
నీభక్తులు జీవించేటందుకు పరిశుద్ధమైన నీనామమే గొప్పఆధారము
గానున్నది నీస్తోత్రముచేయుటకు జిహ్వాకుశక్తిలేదు. నీప్రియుడైన
హజరత్ షఫియ్యున సయ్యదినా మొహమ్మదుగారిని మాసంరక్షణ
కర్తగా పంపినావు అట్టివారిని స్తుతిచేయుటకు శక్యముకాదు. నీవు
వారిమీదస్తుతించిన దలీల్ పఠనచేసి ఆనందభరితులమై యున్నారము.

ఇన్నల్లాహ - వ - మలాయకతుహు - యుసల్లూనా - అలన్ - నిబీ-యా - అయ్యో - హల్లజీన-ఆమను - స్వల్లు - అలైహి - వ-స్వల్లె - ముతస్లిమా ॥

అనగా

ఓభక్తులారా మనసంరక్షణకుగాను పంపబడిన హజరత్ షఫీయ్యన సయ్యదినా మొహమ్మదు గారికి శ్రీభగవంతుడున్ను దేవ దూతలున్ను అశీర్వాదములు పంపుచున్నారు వారిభక్తులమైన మనము వారిని స్తుతిచేయవలయును, ఎటులనగా :—

అల్లాహుమ్మ - సొల్లెఅలా - సయ్యదినా - మొహమ్మదిన్- వ-అలా - ఆలె - సయ్యదినా - మొహమ్మదిన్ - వ-బారిక్ - వసల్లిమ్ - అలైహి ॥ అనగా

ఓభగవంతుడా నీయొక్క ఆశీర్వాదము మనప్రభువైన హజరత్ సయ్యదినా మొహమ్మదుగారియందును, వారిసంతతివారియందును పంపుము.

ప్రతి మహమ్మదీయులు స్త్రీపురుషులు తమ మతమును తెలుసుకొనుట చాలాఆవశ్యకముగాన యీచిన్నపుస్తకములో ముఖ్యమైన కొన్నిఅంశములను వ్రాసి తెలుపుటకై నేను పూనుకొన్నవాడనైతిని యిందులో లోపములు వున్నయెడల దృష్టించక అందులఫలితార్థము గ్రహించి నన్నుదయతో కటాక్షించెదరని ప్రార్థించెదను.

—:0:0:—

హదీస్ అనగా హజరత్ సయ్యదినా మొహమ్మదుగారు పలుమారు వచించిన వాక్కులు (హదీస్) అందురు.

హదీస్—ఇల్ మెంౘదీన్ అనగా ఏమనుజుడైతే తన మతసం బంధమైన ధర్మశాస్త్రమును నేర్చుకొనుటకుగాను వుద్దేశించి ప్రారం భించునో అట్టివానిపాపములను శ్రీభగవంతుడు దూరముచేసి వానికి పుణ్యలోకమును యిచ్చునని హజరత్ సయ్యదినా మొహమ్మదుగారు వచించినారు.

హదీస్—అచ్ఛి - ఇబాదతోఁకె - ఇబాదత్ - పడన - ఫికాకా అనగా

యావత్తుపూజలలో ముఖ్యమైనపూజ యేమనగా.

(పడన ఫికాకా) అనగా మతసంబంధమైన ధర్మశాస్త్రమును నేర్చుకొనుట యీధర్మశాస్త్రమును నేర్చుకొనుటకు ప్రతివాడున్ను అజాగ్రతగా నుండకూడదు. ఇది నేర్చుకొనుటవల్ల ఇహపరలోకము లయందు సుఖముకలుగును మనముచేయుపూజ దేవతార్పణమవును.

—(o):(o)—

పహిలి ఫసల్ అనగా మొదటి అధ్యాయము.

శ్రీభగవంతుడు యావత్తు దేవదూతలు, పైగంబర్లు, మహనీ యులు వగైరాలనామములను వుచ్చరించినప్పుడు యీక్రింద వుదహ రించిన గొప్పమర్యాద విషయమునుగురించి ప్రతిమహమ్మదీయ మత స్తులయొక్క స్త్రీపురుషులు తెలిసికొలవలసినది.

అల్లాహ్ అని వచించినప్పుడు విన్నప్పుడు "జల్ల - జలా లహు లేక అజ్జవ - జల్" అనగా మహాఘనతవహించినవారు.

పైగంబర్ల నామములు వచించినప్పుడు విన్నప్పుడు "అలైహిస్ సలామ్" అనగా శ్రీభగవంతుని ఆశీర్వాదము కలుగునుగాక.

మనప్రియుడైన హజరత్ సయ్యదినా ముహమ్మదుగారి దివ్యనామము వచించినప్పుడు విన్నప్పుడు "స్వల్‌లల్లాహు - అలైహి - వ-ఆలిహి - వ-అస్‌హాబెహి - వసల్లమ్" అని చెప్పవలెను.

ఫిరిష్తె అనగా దేవదూతలు (వారినామము వచించినప్పుడు విన్నప్పుడు " అలైహిస్సలామ్ " అని చెప్పవలెను.

సహాబా అనగా సహచరుల నామమువచించునప్పుడు విన్నప్పుడు "రిజయల్లావాహు - అన్హు" అని చెప్పవలెను.

అహలెబైత్ అనగా హజరత్‌గారి సంతతివారి నామము వచించినప్పుడు విన్నప్పుడు "రజియల్లాహు - అన్హు" అందులో బీబీలనామములు వచించినప్పుడు విన్నప్పుడు "రజియల్లాహు - అన్హా" అని చెప్పవలెను.

మజ్‌తహీదులు, మహానీయులు, (వలీలు) నామములు వినినప్పుడు వచించినపుడు "రహమతుల్లా - అలైహి అనిచెప్పవలెను.

తనమతస్థులను చూచినతక్షణం "అస్‌సలాము-అలైకుమ్" అని చెప్పవలెను. తిరుగావారు వ-అలేకు - ముస్సలామ్ - రహమతుల్లాహి వ_బరకాతుహు ॥ అనగా మీకు క్షేమము కలుగునుగాక మరియు శ్రీభగవంతుని ఆశీర్వాదము కలుగును,

ప్రతిమనుజుడు తుమ్మినప్పుడు " అల్‌హందు లిల్లా " అనగా శ్రీభగవంతునికి నావందనము కారణమేమనగా (నాప్రాణముకు యేలాటి అపాయముకలుగలేదు) వినేవారు "యరహము-కుముల్లా" అని చెప్పవలెను అనగా నీయందుసహా శ్రీదేవుని ఆశీర్వాదము కలుగునుగాక.

మరణమైన సంగతి వింటే " ఇన్నాలిల్ లాహి - వ-ఇన్నా - ఇలైహి రాజేవూన్ " అని చెప్పవలెను.

సంతోషకరమైన సంగతివింటే—సుబ్ హా - నల్లాహి - వల హందు లిల్లాహి - వలా - ఇలాహ - ఇల్ లల్ లాహు - వల్లాహు - అకబర్ ॥ అని చెప్పవలయును.



## (2) దూసరి ఫసల్ అనగా రెండో అధ్యాయము.

### వుస్తాద్ అవుర్ మాబాప్ కె ఆదాబోన్ కె బయాన్ మె

### అనగా

### గురువులయొక్క తల్లిదండ్రులయెడల మర్యాదవిషయము.

గురువులవారియొక్క తాబెదారి మనఃపూర్వకముగా చేయవలెను. వారియదుట మిక్కిలివినయముగా నడుచుకోవలెను. తాను వారి బానిసవాడుగా నెంచుకోవలయును.

గురువులయొక్కబుద్ధి తనబుద్ధికంటె తక్కువయని తలచకూడదు. వారువకవేళ మనలను తిరస్కారముగా మాటలాడినను అది మనవిషయములో మర్యాదగా యెంచుకోవలెను. యల్లపుడు వారి సన్నిధిలోనుండుట తనకు ఘనతగానుండునని తలచవలెను.

వారియదట ఏరీత్యామనము మర్యాదగా వర్తించుచున్నామో ఆరీతిగానే వారిగైర్ హాజరికాలములో వర్తించవలెను. తనయెదుట తనగురువును యవరేగాని తిరస్కారముగా మాటలాడినంతట దానిని తానుతరిక్కించి రద్దుపర్చవలెను. అటురద్దుచేయుటకు శక్తిచాలనంతట ఆస్థలమునువిడిచి వెళ్ళిపోవలెను.

వారు బ్రతికియుండు కాలములో వారి క్షేమమునకై గాను శ్రీ భగవంతుని ప్రార్థనచేయవలెను. ఒకవేళ వారుమృతిచెందినయెడల వారిపేరట దానధర్మములు చేయవలెను. వారిసమాధివద్దకుపోయి వారికి క్షేమముకలుగునట్లు దేవుని ప్రార్థించవలెను.

వారిని మరువకుండా అప్పుడప్పుడు వారిసమాధివద్దకు పోతూ రావలశినది. ఒకవేళ వారివల్లనీకు శ్రమకలిగినప్పుడు వారిని క్షమాపణము అడుక్కోవలెను. వారిముందరఘట్టిగా మాటలాడకూడదు నేత్రములచూపును క్రిందవుంచి వారితో మర్యాదగా మాట్లాడవలెను.

వారుచెప్పుమాటలను విశ్వాసముతోనున్ను మర్యాదతోనున్ను వినవలెను, వారియెదుట మీసముపైన చెయ్యివుంచి సంభాషణ చేయకూడదు. వారియెదుట శిరస్సుయందు, వంటిపైన, వస్త్రములు లేక కూర్చుకోనకూడదు వారియొక్క సేవచేయుటవల్ల ఇహపరలోకములయందు సుఖముకలుగును.

హదీస్—యెవరైతే తనయొక్క గురువునకు మర్యాదచేయుటకు అసూయపడితే శ్రీభగవంతుడు వానికి మూడు ఆపత్తులు కలుగచేయును,

(1) సిఖాసా - ఇలం - భూల్ జాయెగా అనగా నేర్చినవిద్య మర్చిపోవుట.

(2) జవానీమె మర్ జాయెగా అనగా మంచి వయస్సులో అనగా యవ్వనములో చనిపోవుట.

(3) బేఈమాన్ మరేగా అనగా శ్రీభగవంతునియందు విశ్వాసములేక చనిపోవుట.

పైనచెప్పిన మర్యాదలప్రకారముగా తనతల్లితండ్రులయందున్నూ తప్పక నడుచుకోవలసినది. శ్రీభగవంతుడు "ఖురానెషరీఫ్‌లో" ఇుత్తెరంగున వచించియున్నారు.

నీతల్లితండ్రులు నిండావృద్ధులైనప్పుడు వార్లతో అసూయపడ కూడదు. ఆగ్రహమువచ్చి వారిని తిరస్కరించ కూడదు. వార్లతో మిక్కిలి విధేయతగానున్ను వినయముగానున్ను మాటలాడ వలయును. నీవుయెల్లప్పుడు వారివిషయమై శ్రీభగవంతునివద్ద వారిపైన కృపనున్ను క్షేమమున్ను కలుగునటుల ప్రార్థించుము.

హదీస్—ఏమనుజుడు తనతల్లిదండ్రులకు సంతోష పెట్టకనుంటాడో వానియందు శ్రీభగవంతుడు సంతోషము పెట్టకయుండును.

హదీస్—ఎవరైతే తల్లిదండ్రులకు అవిధేయతగా నడుచుకొనునో అట్టివాడు దేవదూతలతోనున్ను స్వర్గముతోనున్ను దూరగమవును నరకమునకు సమీపమవును.

## (3) తీసవి ఫసల్ అనగా మూడో అధ్యాయము.

నమాజ్‌కి - ఫజీలత్ కె - బయాన్ మె

అనగా

నమాజ్ యొక్క ఘనతను గురించి.

హదీస్—మోమిన్ - అవుర్ - కాఫర్ మె ఫర్క్ - నహీ - శివాయి - నమాజ్ కె ॥

మోమిన్ అనగా విశ్వాసము కలిగినవాడు.

కాఫర్ అనగా మతమందు నమ్మకము లేనటువంటివాడు,

ఎవరైతే శ్రీభగవంతుని ప్రార్థనచేస్తువుంటాడో వాడే మోమిన్ అటు ప్రార్థనచేయక వుండువాడే "కాఫర్"

హదీస్—ఖియామత్‌మె అనగా న్యాయదినమందు పాపము చేసినవారి మొగములు నలుపుగా నుండును. ముఖ్యముగా నమాజ్ చదువకుండా వుండేవాడు శ్రీభగవంతుని సన్నిధిలో వాడు చేసిన పుణ్యములు వప్పుదలకావు. యావత్తుప్రవక్తలున్ను మహనీయులున్ను వానియందు అసూయతగా చూతురు.

హదీస్—అయిదు వేళలయందు యేమనుజుడైతె నమాజ్ అనగా (దేవుని ప్రార్థన) మంచివిశ్వాసముతో చేయునో అట్టివాడు నరకమునకు దూరమవును.

నమాజ్‌కే - తర్‌తీబ్ అనగా ప్రార్థనచేసేవిధములు తెనుగులో వ్రాయబడిన మహమ్మదియా పంచనిబంధన గ్రంథములో వివరముగా వ్రాయబడివున్నది.

—(*)—

## (4) చార్‌విక్ ఫసల్ అనగా నాలుగో అధ్యాయము.

### జుమాకే - నమాజ్‌కే - బయాన్‌మె

### అనగా

శుక్రవారము రోజున స్నానముచేసి మంచిశుభ్రమైన వస్త్రము లనుధరించి సువాసనలతో మశీదుకు పోవలసినది.

జుమాకి నమాజ్, ఈదోన్‌కి నమాజ్ యొక్క వివరమున్ను ఫలమున్ను శిరాతుల్‌నజాత్, మిఫ్‌తాహుస్ సలాత్, పుస్తకముల లోనుంచి గ్రహించవలెను.

బిసాఇస్లామ్ సంగతులను గురించి.

(1) కల్మా - పడనా అనగా మహావాక్యము పఠనచేయుట.

(2) నమాజ్ అనగా ప్రార్థన.

(3) రోజా అనగా వుపవాసము.

(4) జకాత్ అనగా ధర్మము.

(5) హజ్ అనగా మక్క-మెషరీఫ్ యాత్ర-

వీటియొక్క వివరములు తెనుగులో వ్రాయబడిన మొహమ్మదీయ పంచనిబంధన గ్రంథములో వ్రాయబడియున్నది చూచితెలుసుకోవలయును.



## (5) పాంచ్వీఁ ఫసల్ అనగా అయిదో అధ్యాయము.

జుబ్హాకే - బయాఁమె అనగా బలియిచ్చువిషయము.

మహమ్మదీయమతములో యేజంతువులనైతే తినవచ్చునని చెప్పివున్నదో వాటిని బలియిచ్చువివరము వివరించెద.

(1) మొదటి వజువు కాళ్లు, చేతులు, మొగము, వగైరాలను ఏతరహాగా కడుగవలెనని చెప్పినదో ఆమేరకు పరిశుద్ధి చేసుకొనుట.

(2) ఆమనుజుడు పరమటిమొఖము చేసి ఏతరహాగా జంతువును పట్టవలెనో ఆతరహాగాపట్టి పదునుకలిగిన కత్తినితీసుకొని యీక్రింద చెప్పే మహామంత్రములుచదివి కోయవలెను.

బిస్మిల్లాహి - అల్లాహు - అకబర్

ఆజంతువునుపట్టుకునేవాడునహా ఈమహామంత్రమును చదువవలెను.

జంతువును బలిచేయుటలో యెప్పుడును యిద్దరు వుండవలెను అనగా పట్టుకునేవాడు వకడున్ను కోయువాడు మరివకడున్ను వుండవలెను. ఒకడే ఆపనిచేయకూడదు. బలియిచ్చుటలో నిండాపదును గల ఆయుధము వుండవలెను.

బలిచేయుటలో ఏమనుజుడయితె ఆమహామంత్రమును చదవక మరిచిపోయినాననితలచితే అట్టిజంతువును తినకూడదు. "హరాం" అని పిలువబడును.

సవాల్—ఏమనుజునికి బలియిచ్చు నిబంధనలు తెలుసునో అట్టివాడేచేయవలెను. అట్టివాడు చేసినబలి "హలాల్" అని పిలువబడును. హలాల్ అనగా న్యాయమైనబలి.

మైనరులు అనగా 18 సంవత్సరములకులోపల నుండువారు, స్త్రీలు—(కత్నా చేయకుండా వుండేవాడు, వజువు లేకుండావుండేవాడు బలిచేయవచ్చును.)

సవాల్—ఆబలిచేయుటలో "బిస్మిల్లా" చెప్పుట ముఖ్యమైన పనిగానున్నది. గొంతుపైన నాలుగు నరములువున్న గొంతుపీక మెడవద్దవుండు ఆహారము, నీరుపోవు రెండునరములను నరకవలెను.

సవాల్—పక్షులను షికారిచేయుటలో బాణముతోగాని లేక అయుధముతోగాని మంత్రముచెప్పతూ చేయవలెను.

సవాల్—బలిచేయు కాలమందు సదరు జంతువుకు ప్రాణము వున్నదని నిశ్చయముగా తోచినయెడల కాళ్ళు, రెక్కలు కొట్టుకొనుట రక్తముకారుట అనావశ్యకము.

మరియు ప్రాణములేదని భావించిన జంతువును బలిచేసినంతట కాళ్లుకొట్టుకొనుట, రక్తముకారుట, దోరు, నేత్రములుతీసుట,

వెంట్రుకలులేచుట యీాగుర్తులు కనుపడినయెడల హలాల్ అని యెంచవలెను. లేనంతట హరాం అనబడును.

సవాల్——బలిచేసినజంతువు అరచిన లేక పరుగెత్తిన, తిరిగి చూచిన యీకార్యములవల్ల బ్రతికినజంతువును బలిచేసినట్లు హలాల్ తలచవలెను. బలిచేయునప్పుడు జంతువుయొక్క శిరస్సు చేతికితెగి వస్తె (మకురూ) అసహ్యాకరముగా నుంటున్నది.

——(o):(o)——

## (6) ఛెటవీఁ ఫసల్ అనగా ఆరో అధ్యాయము.

పిషాబ్కి - పాకీకె - బయాఁమె

అనగా

అల్పాచమానముచేసినప్పుడు శుద్ధిఅయ్యే విషయము.

ప్రతిమనుజుడు అల్పాచమానము విషయములో అశ్రద్ధగా నుండకూడదు.

హదీస్——షరీఫ్మె - ఆయాహై బదఁ - అఫ్రల్ కపర్తోఁకు పిషాబ్సె - పాక్నరక్నా - అజాబెఖబర్ - జియాదా హోనేకా సబబ్హై ॥ అనగా

హజరత్ సయ్యాదినా మొహమ్మదుగారు యీావిధముగా వచించియున్నారు గనుక యెవరైతె మూత్రముయొక్క శుద్ధిచేయకుండాపోవునో అట్టిమనుజునికి గోరియందు నిండాదుఃఖముకలుగును

అల్పాచమానముచేసినవాడు భోజనపదార్థములుగాక దేనివల్ల పరిశుద్ధిచేయవచ్చునో అట్టిదానివల్ల పరిశుద్ధిచేయవలెను. మట్టిపెళ్ళతో శుద్ధిచేసుకొనవచ్చును. పేడ, కాలినముటికె కూడదు.

మట్టిపెళ్ళను ఎడమచేతిలో నుంచుకొని మూడు పర్యాయము లు దానిని భూమిపైన కొట్టవలెను. (తిన్నగా) అల్పాచమానము మిట్టగానుండు భూమిపైన చేయకూడదు.

పరమటతట్టు మొగముగాని, నీపుగాని, సూర్య చంద్రాదుల తట్టుగా మొగము చేసిగాని గాలికియెదురుగాగాని, బిలములోగాని, నీళ్ళలోగాని, ఫలవృక్షములయందుగాని, నీడ స్థళములోగాని, మశీదులకున్న యీదుగా స్థళమునకు ముందువెనుకగాగాని స్మశానభూమిలోగాని, దారిలోగాని, తగ్గులోనుంచి ఎత్తయినస్థళములోగాని చేయకూడదు.

అల్పాచమానము చేసినమనుజుడు రహస్యమైన స్థళములోనిల్చి మర్మస్థళముయొక్క నీరుదారి (లింగము) పైన సదరు మట్టిపెల్ల నుంచవలెను. ఎవరితో మాటలాడకుండా వుండవలెను. అటుయిటు పదిబార్లు తిరుగుతూ నుండవలెను.

మర్మస్థళముయొక్క నీటిదారిలో యేమాత్రము నీరులేకుండా బీల్చినపిదప సదరు పెల్లనుతీసి క్రిందపారవేయవలెను. పిమ్మట నీటితో శుద్ధిచేయవలెను.

స్త్రీలకు పైమేరకు చేయునటుల వుత్తర్వులేదు. వారలు నీటిలో మూడుపర్యాయములు శుద్ధిచేసుకోవలెను.

——(*)——

## (7) సాత్‌వీఁ ఫసల్ అనగా ఏడో అధ్యాయము.

### పాఖానేకి - పాకీకె - బయాఁ మె

అనగా

### అధికాచమానము అనగా (పాయిఖానా) గురించి.

ఏమనుజుడైతే అధికాచమానమే అనగా (పాయిఖానాకు) చేయబోవునో వాడు ముఖ్యముగా యీ క్రింద వివరించిన పనులను చేయవలెను.

సాధ్యమైనమట్టుకు తానుధరించిన వస్త్రములను తీసివేసి వేరు వస్త్రములను ధరించవలెను. మట్టిపెల్లలు 5, 7, లేక 3 తీసుకొని రహస్యమైన స్థళములోపోయి మొఖము, వీపు పరమటలేకుండా ఎడమహస్తం గడ్డముక్రిందనుంచి చెంపనైన వచ్చునట్టుగాను మోచేయి ఎదురుకాలిపైన బలంగావుంచి గొంతుకూర్చోవలెను.

అపనేకు బరహనా నకర్నా అనగా దిగంబరుగా నుండకూడదు.

తనమానమును నిష్కారణముగా చూచుకోకూడదు. అప్పుడు యేవస్తువునుగాని తినకూడదు, తాగకూడదు. అప్పుడు తుమ్మువచ్చినా మంత్రము చదువకూడదు, మాటలాడకూడదు.

భూమిపైనగాని ఇతరత్రగాని వ్రాతవగైరా యేమిపని చేయకూడదు. సదరు మురికిని మొదట మట్టిపెల్లతో శుద్ధిచేసి మురికిమట్టిపెళ్ళపైన కనుపడుకుండునటుల శుద్ధిచేయవలెను.

అటుపిమ్మట మరివక నూతనమట్టిపెల్లతో పిషాబ్‌కి.పాకి యను అధ్యాయములో చెప్పినవిధముగా మూత్రద్వారమును శుద్ధచేసుకోవలయును. అటుపిమ్మట తనగుదస్థానము నీళ్ళతోశుద్ధిజేయువలెను.

ఇంకావిశేషముగా యీవిషయమై వ్రాయబడిన "ఫిక్‌హ" శాస్త్రములో చదివి తెలుసుకోవలయును.

—:0:0:—

## (8) ఆట్‌వీఁ ఫసల్ అనగా ఎనిమిదో అధ్యాయము.

వజూాకె - బయాక్ మె

అనగా

వజూ అనగా హస్తములు, కాళ్ళు, మొగము, నాసికము, ముంజేతులు, తలమొదటిభాగము వగైరాలనుతడుపుట. ఏవిధముగా వజూచేయవలసినదిన్ని ఈక్రింద వివరముగా వ్రాయబడివున్నది.

శ్రీభగవంతునిపై విశ్వాసముతో మొదట యేమనుజుడైతే వజూ జేయనారంభించునో అప్పుడు నాహస్తములు పాపముజేయకుండగను తెలియక చేతులతోచేసిన పాపములను హరించవలసినదని కడుగు కుంటున్నాను.

నోటియందు ఉదకమునుంచి పుక్కిలించి పుమ్మివేయుచున్నాడు ఏమనగా :—

ఓభగవంతుడా నీయందు జ్ఞాపకమును, నీయందు కృతజ్ఞత యును, నీవు హజరత్ సయ్యాదినా మొహమ్మదుగారికి పంపబడిన "ఖురానెషరీఫ్" చదువుటకు నాకపేక్ష దయచేయుము.

ఎప్పుడైతే ముక్కునసీటిని మూర్కొనునో అప్పుడు ఓదేవుడా స్వర్గమునందుండు మంచిసువాసనను నాముక్కుకు వచ్చేలాగునజేయు ము, నేనుచెయు కార్యములవల్ల నీవుసంతోషింపుమనియును ప్రార్థిం చుచున్నాడు.

ఎప్పుడైతే నీటితోమొగమును పరిశుద్ధమైనదానిగా జేయబూ నునో అప్పుడు ఓభగవంతుడా నీవు నీభక్తులకు ముఖకాంతిని నేచంద మున నొసగితివో ఆరీతిగా నాకుముఖకళ యివ్వుమని ప్రార్థించు చున్నాడు.

ఎప్పుడైతే కాళ్ళను నీటితోను కడగబూనునో తత్కాలమం దు ఓభగవంతుడా నాపాదములు నీయొక్క పుణ్యస్థలమునకు వచ్చు నవిగాను మిక్కుటమైన బలముకలవిగాను, సత్పురుషులచెంతకు సర్వ దా పోవునట్టివిగాను చేయుమని ప్రార్థించుచున్నాడు.

ఈచందముననే ఏమహమ్మదీయక్ మనుజుడైతే త్రికరణశుద్ధి గాచేయునో అట్టిపుణ్యాత్ముని దేహమండల సర్వాంగ సంగతములగు పాపరాసులెంత దుర్భరములైనను నశించుచున్నవనియు, నట్టిపురుషు డే పరిశుద్ధుడని హజరత్ సయ్యదినా మొహమ్మదుగారు నిరూపించి యున్నారు.

ఈపగిది మహమ్మదీయక్ వేదాంతులు పైనవ్రాసియున్న యీ వదంశములును అంగీకరించి యివి మనుజునియొక్క బాహ్యశుద్ధి అని యు, అంతఃశుద్ధి అనగా మనోవాక్కాయ కర్మముల నేకీభూతంబు గాచేసి ఆంతరార్థ పర్యాలోచనకలిగి కామ, క్రోధ, లోభ, మోహ మద, మాత్సర్యాది, శత్రుషడ్వర్గంబుల జయించి యద్యత్పశ్యతిచక్షు ర్భ్యాం। తత్తదాత్మేతిభావయేత్॥ అను మహావాక్యమునుబట్టి నిశ్చ యముగా భగవంతుని స్మరియించుటయే మనఃశుద్ధియని నిరూపించిరి.

హదీస్—ప్రార్థననిమిత్తం మెవరైతే వజూచేయుటకు అరం భముచేయగా అంత్యము అయ్యేలోపల అతని పాపములు నశింపు చేయును.

హదీస్—ఎవరైతే వజూచేసి నిద్రపోవునో అట్టివాడు ఆనిద్రలో మృతిపొందితే స్వర్గముపొందును.

వజూచేయు విధము.

వజూచేయ నారంభించు మనుజుడు నెత్తిన యేమిలేకుండా (బరహనాశిర్) పరమట (రూబఖిబ్లా) తట్టు గొంతుకూర్చుం

డవలెను. మొదట రెండుచేతులను వేరువేరుగా కడుక్కొని ఆవల రెండుకల్పి వకటిగా హస్తములను మనికట్టువరకు మూడుపర్యాయములు కడుక్కొవలసినది.

(అతవజ్జులె రిఫఇల్ హదసె) నేను నాలోమలినము వున్నయెడల పరిశుద్ధుడగుటకుగాను కడుక్కొంటానని విశ్వాసము వుంచుకోవలెను. హస్తములో నీరుతీసుకొని మూడుపర్యాయములు పుకిలించి అనగా (కుల్లి-కర్నా) వుమ్మివేయవలెను.

ఉపవాసములేనప్పుడు "గర్గరా" చేయవలెను. తిరిగి కుడి చేతిలో నీరుతీసుకొని ముక్కునకు మూడుపర్యాయములు మూరొక్కనవలెను. అనీరు బైటికిపోవునటుల చీదవలెను.

ఎడమచేతి మొదటి తడివేళ్ళను ముక్కురంధ్రములలోనుంచి పరిశుద్ధిచేయవలెను. ఆవల రెండుచేతులతో నీళ్లుతీసుకొని మొగమును నొసటనుంచి చెవులనువిడచి తుడ్డిక్రిందవరకు మూడుపర్యాయములు కడుక్కొనవలెను.

చేతులయొక్క ముంజేతులను మూడు పర్యాయములు వ్రేళ్ళనుంచి పైవరకు అనగా (కోనియా-సమేత్-ధోనా) నీళ్లనువిదలిస్తు కడుక్కొనవలెను. మొదటకుడిచెయ్యి ఆవల ఎడమచెయ్యి.

రెండుహస్తములతో నీళ్లుతీసుకొని శిరస్సు మొదటిభాగమును తడిపి (పవుసర్కామసా) అని చెప్పుదురు. పెద్దవేలి ప్రక్కవేలితో ఆయావ్రేలితట్టునుండు చెవులలోనుంచి చెవులను పరిశుద్ధము చేయవలయును.

రెండుహస్తములను తలపైనసుంచి మెడమీదుగా వ్రేళ్ళతో తియ్యవలెను. పాదములను వ్రేళ్ళనుంచి పైభాగమువరకు కడగవలయును. మొదట కుడిపాదము శుద్ధిజేయవలెను.

వజూవిషయమై యీచిన్నపుస్తకములో సూక్ష్మముగా వ్రాసినాను. విశేషముగా తెలుసుకోవలయుననువారు గొప్పపుస్తకము (మిఫ్ తాహుస్సలాత్ను) చదవగా విశేషముగా గ్రహింతురు.

సవాల్—వజూమె చార్ ఫరజ్ అనగా నాలుగు అవశ్యకమైన పనులు వున్నవి.

(1) మొగముకడుగుట, నొసటనుంచి తుడ్డికె.నిచ్చే వరకు.

(2) హస్తములను ముంజేతికోసే (మోచేయి) వరకు.

(3) పవుసర్రుమసా కర్నా అనగా శిరస్సుయొక్క నడిమిభాగమునందు నీరుచేత తడిచేయుట.

(4) పాదములను (తఖనా) వరకు అనగా కీలుమండలవరకు కడగవలెను.

యీనాలుగింటిని శుద్ధిచేయుటలో వకవెంట్రుక వెడల్పు మోయిను అయినా తడువకుండా వుండకూడదు.

వజూలోవుండే (1) సున్నతాఁ, (2) ముస్తహాబాఁ, (3) మకరూహాత్, వీటియొక్క వివరములు "మిఫ్ తాహుస్సలాత్" యను పుస్తకములో చూడవలయును.

—(o):(o)—

(9) నౌవీఁ ఫసల్ అనగా తొమ్మిదో అధ్యాయము.

గుసుల్ కె-బయాఁమె అనగా స్నానముచేసే విధము.

ఆస్నానము ఎప్పుడెప్పుడు చేయవలెనంటె :—

(1) భార్యాభర్తలు రాత్రియందు నిద్రించినవెనుక స్నానముచేస్తె జనాబత్ కా గుసుల్" అని పిలువబడును.

నిద్రలో కళంకము కలుగడము దానిని "ఏహెంతలాంకా గుసుల్"
అని పిలువబడును.

(2) స్త్రీలు బయటచేరినవెనుక "హైజ్ కా గుసుల్" అని
చెప్పబడును.

(3) గర్భిణిస్త్రీలు కనినవెనుక "నిఫాస్ కా గుసుల్" అని
చెప్పబడును.

మహమ్మదీయ మతములో (గుసుల్) స్నానముచేసే ఆచార
ము యీవిధముగా చెప్పబడివున్నది.

ఏమనుజుడైతే (గుసుల్) స్నానము జేయవలెనని వుద్దేశించునో
అతను అల్పాచమానముయొక్క స్థానమును శుద్ధిజేయవలెను.

పిమ్మట ఆశుక్లము తగిలిన స్థళములు అనగా తొడలు వగైరా
లను శుద్ధిచేసుకొని అదివరకు తానుకట్టియుండు వస్త్రమును తీసివేసి
మరియొక వస్త్రమును కట్టుకొని నీరును నోటియందు వుంచుకొని కం
ఠనాళమువరకుపోనిచ్చి వుమ్మివేయుట. దీనిని "గర్గరా" అని
చెప్పబడును.

(2) నాక్ మె - పానిలేనా అనగా నాసికమునందు నీరుతీసు
కొని కడుక్కొనుట.

(3) తమామ్ - బదన్ - తర్ - కర్నా అనగా తరువాతయా
వత్తుదేహము తడుపుట.

ఈపైన చెప్పబడిన విధముగా స్నానము చేయవలెను. వక
వెంట్రుక ప్రమాణముఅయినా తడవక విడిచినయడల ఆ (గుసుల్)
అనగా స్నానము వప్పదలకాదు.

స్నానము చేయునప్పుడు యీక్రిందచెప్పిన మంత్రము చదవవలెను.

అగ్తసెలో - లెరిఫఇల్ - హదసే

అనగా

నాశరీరములోనుండు యావత్తు అపరిశుద్ధత్వముపోయి పవిత్రుమగుటకుగాను స్నానము చేయబూనినాను.

సవాల్—స్నానమును రహస్యమైన స్థలములో నిశ్శబ్దముగా చేయవలయును.

ఇంకా యీవిషయమై జాస్తీగా తెలుసుకోవలెనని కోరువారు "మిఫ్తాహుస్సలాత్" అను గ్రంధమునుచూచి తెలుసుకోవలయును.

—:0:0:—

## (10) దస్వీఁ ఫసల్ అనగా పదో అధ్యాయము.

తయంముమ్‌కే - బయాఁమె

అనగా

నీరు లేనికాలములో మట్టితో పరిశుద్ధి అవుట।

1 తయంమమ్ చేయుటకు ఉద్దేశించుట.

2 రెండుహస్తముల చేత భూమిని తాకి నొగిమీద పూసుకొనుట.

3 అట్లు తాకిన పిదప మోచేతులవరకు అంగుళముల చేత తాకుట.

వజూచేయుటకు నీరుదొరకని సమయములో తయంముమ్ చేయవలసినది. ఈవిషయములో యింకా వివరములు తెలుసుకొననుద్దేసించువారు తెనుగునవ్రాయబడిన "చార్‌కుర్సి పాంచ్‌కలమా" అను గ్రంధమును చూచుకోవచ్చును.

అజాన్ కా - బయాన్ ॥ నమాజ్ కే - వఖ్ తాన్ కా - బయాన్,

నమాజే - విత్తర్ కా - బయాన్ ॥

అనగా

ఇందుల అర్థమువగైరాలు తెనుగున వ్రాయబడిన మహమ్మదీయ పంచనిబంధన గ్రంథములో విశదముగా వ్రాయబడివున్నది చూచి తెలుసుకోవలెను.

---

## (11) గ్యార్ వీన్ ఫసల్ అనగా పదకొండో అధ్యాయము.

జనాజేకే - బయాన్ మే

అనగా

ఏమనుజునికైతే మరణము సమీపించుచున్నదో చనిపోవువాడు గాని లేక వానిసమీపములో నుండువాడుగాని వాడు అవివరలో చేసిన పాపములను గురించి,

తౌబా - అస్తగ్ ఫార్ అనగా క్షమాపణ అడక్కవలెను.

శ్రీభగవంతుని నామస్మరణచేస్తు అతని ఆశీర్వాదమునకు పుచ్ఛ్వారిగా నుండవలసినది.

వ్యాధిగ్రస్తునియొక్క సమీపములో నుండువారలు రోగియొక్క హస్తముల, కాలివ్రేళ్ళయొక్క గోళ్ళనుతీయించి శిరస్సు, గడ్డము, మొగము, భయంకరచూపు లేకుండునటుల క్షవరము చేయించవలెను. క్షవరముచేయించను అనుకూలములేకుంటె కత్తిరింపుచేయించవలెను. పరిశుద్ధిగానున్ను సువాసనగానున్ను వుంచవలెను.

కల్-మయె - తౌహీద్ - పఢె

అనగా

లా ఇలాహ - ఇల్ల్లల్లాహు - వహ్దహు - లాషరీకలహు లహుల్ - ముల్కు - వలహుల్ - హ్దాను - యొహీఇ - వయిమీతు మరియు ॥ సూరయెూయాశిక్ । వ్యాధిగ్రస్తునివద్ద అతనువినేటట్లుగా చదివిస్తురావలెను.

అటుపిమ్మట సదరు రోగి గతించినంతట నేత్రములను దగ్గర నుండువారలు తమచేతులతో మూయవలెను.

తుడ్డీ అనగా గడ్డముక్రిందనుండి శిరస్సువరకు పెదిమ్ములుమూసి థాట్గా అనగా (గుడ్డపేలిక) కట్టవలెను.

కడుపువాచెటట్లుగా (అనగా వుబ్బేటట్టు) కనుపడినయెడల గోధుమలనుగాని, వుప్పునుగాని లేక బరువుగల ధాన్యమునుగాని వక స్తుమారైన మూటకట్టి కడుపుపైన నుంచవలెను.

చనిపోయిన ఇసము అదివరలో కట్టియుండు వస్త్రములను తీసివేసి వేరేపరిశుద్ధమైన వస్త్రములను కట్టించి వుంచవలెను.

ఆ స్థలములో సువాసనలుండునటుల సాంబ్రాణి, వూదుబత్తి యీమొదలైన సువాసనలు వుంచవలెను.

గతించిన మనుజునికి స్నానముచెయించే విధము :—

తనయింటి అవరణములో 2 రెండుగజములు పొడుగు మూడు ముకాలుగజము వెడల్పు ఐదుజిట్టెడులోతుగా గుంతత్రొవ్వి దాని పైనసదరు గుంతకు సరిపొయ్యేలాగున నొకబలమైన పలకనుంచి శవ మును తెచ్చి ఎల్లెలకల. పండపెట్టవలెను.

3 మూడు కడవలనీళ్ళను వకభానలోవేసి అందులో కర్పూ రము, రేగుఆకు (రెండు పిడికెళ్లు) వేసి షుమారుగా కాచినపిదప శవముపైనసుండు వస్త్రములను తీసివేయవలెను.

ఒకగజము నూతనగుడ్డను నాభిమొదలు మోకాళ్ళ క్రిందివరకు బాగాకప్పవలెను. గుదస్థానమును (పాయిఖానాస్థలము) మట్టిపెళ్ళతో శుద్ధిచేసి ఎడమహస్తమునకు గుడ్డచుట్టుకొని పృష్టభాగమును మరి ఒకడు నీళ్ళుపోస్తువుండగా రుద్దవలెను.

తరువాత ఆగుడ్డనుతీసివేసి వేరుగుడ్డనుచుట్టుకొని మర్మస్థానమును, పృష్ఠమువగైరాలను నీళ్ళుపోసిబాగారుద్ది శుద్ధిచేయవలెను.

స్త్రీశవమునకు రొమ్ము పైభాగమునుంచి పాదములవరకు పై మేరకు నూతనవస్త్రమునుకప్పి పురుషశవమునకు యేరీతుగా చేయబడునో ఆవిధముగా చేయవలెను.

వజూచేయించవలెను ఆవల కూకుడుకాయలను నీళ్ళలోవేసి బాగాపిసికిన నీళ్ళవల్ల శవముయొక్క యావత్తుదేహమును శిరస్సుమొదలు అంగుష్టపర్యంతము బాగాకడుగవలెను. అపిమ్మట పైవేడినీళ్ళతో శవమును స్నానము చేయించవలెను.

స్నానముచేయించేటప్పుడు సువాసనవుండులాగున సాంబ్రాణివగైరాల పొగవేస్తువుండవలెను. స్నానముచేయించిన తడిగుడ్డను తీసివేసి ఆపొడుగుగల సుక్కి-లుంగీని పైచెప్పినమేరకు శవమునకు కప్పవలెను.

కఫన్ అనగా మొగపురుషునికి **3** మూడుగుడ్డలు.

**1** లిఫాపా, **2** ఇజార్, **3** కఫిని

లిఫాపా వగైరాలను శవమునకు తొడిగించి అత్తరువగైరా సువాసనలను అంటించి సదరు కఫన్‌లో మూడుకట్లుకట్టి ఒకమంచములో పండబెట్టి తిన్నగా స్మశానభూమికి తీసుకపోవలయును. అక్కడ "జనాజా నమాజ్" చదివించవలెను.

ఖబర్ కాఅందాజా—శవము ప్రమాణముపొడుగు, అందుల అర్ధప్రమాణము వెడల్పు, మొగవాండ్లకు నడుముపైవరకున్ను స్త్రీల కురోమ్ముకు పైభాగమువరకు లోతుగా గుంతత్రొవ్వించవలెను. పై ప్రమాణములకు మించాగా త్రొవ్వినను మంచిదేను.

ఇందులో "లహాద్-అవుర్-షఖ్" అనివున్నది. అందులసంగతి నేను యిక్కడవ్రాయలేదు. సాధారణమైన సంగతివ్రాసినాను.

శవమును పరమటతట్టు మొగముచేసి ఎడమతట్టుగా పొర్లించి పండపెట్టవలెను, నడుముకట్టుతప్ప మిగతరెండుకట్లు విప్పవలెను

మిన్హా - ఖలఖ్నాకుం - వఫీహానోయిదోకుం - వమిన్హా నొఖ్రిజోకుం - తారతన్ - వుఖ్రా ॥ ఈమంత్రమును చెప్పుచూ మట్టివేసి బూడ్చవలశినది.

స్త్రీశవమునకు పైచెప్పిన మూడువస్త్రములకుగాను "సీనాబంద్" మూడున్నరగజము పొడుగు వక్కగజము వెడల్పువుండవలెను. వకదావునిన్ని ఇజారున్ను వుండవలెను, మిగతసంగతులు యావత్తు పురుషశవమువలెనే చేయవలెను.

ఈచిన్నపుస్తకములో యీవిషయమై చాలావివేషముగా చెప్పలేదు జాస్తిగా తెలుసుకోవలయునునువారు "శిరాతున్నజాత్ - మిఫ్ తాహుస్-సలాత్" అను వగైరా గొప్పగ్రంధములను చూచి తెలుసుకోవలయును.

——(*)——

## (12) బార్వి-ఫసల్ అనగా పండ్రెండో అధ్యాయము.

### పాకీ కి-బయాన్ మె అనగా పరిశుభ్రమునుగురించి.

సవాల్—గుసుల్ - కాహిసే - కర్‌నా

జవాబ్—నీళ్లతో చెయ్యవలసినది.

సవాల్—పాని - కైసా - హోనా

జవాబ్—నీళ్లు నాలుగు తరహాలుగా నుండవలెను.

(1) దహాదర్‌దా హావుజ్-యా-బావుడి అనగా భావి.

(2) బహాతా-హువా-పాని అనగా పారేనీళ్ళు.

(3) కువ్వా అనగా చెలిమ.

(4) బారిష్ - అవుర్ - చష్మేకే.

సవాల్—దహాదర్‌ద - కిసె - బోల్‌తేహీఁ

జవాబ్—10 గజములపొడుగు, 10 గజములువెడల్పు 100 గజములమధ్యలో నుండవలెను. అందులో కొంచమైనను తక్కువగా నుంటె అది "దహాదర్‌దా నహీఁ"

అందులోనీళ్లు మనము దోసిలితోతీసుకుంటె బురదగా కాకూడదు. ఆనీటితో "వజూ, గుసుల్" నిస్సందేహముగా చేయవచ్చును. ఆమేరకు నీటియొక్క రుచి, వాసన, వర్ణము బేధముకాకుండువరకు వుపయోగించుకోవచ్చును.

ఎప్పుడైతె యీమూడు వర్ణములు బేధించినప్పుడు "వజూ గుసుల్" చేయరాదు.

సదరు జలములో కుంకుమపువ్వు, సబ్బు యీవగైరా సువాసనవస్తువులుపడి కొద్దిరోజులు అందులో వుండినయెడల రంగు, వాసన, రుచి బదలాయించిన ఆనీరు శుభ్రముగానున్నదని యెంచవలసినది. అట్టినీరుతో గుసుల్ - వజూ చేసుకోవచ్చును. అయితే నీళ్ళు తేటగానె వుండవలెను. మడ్డిగా నుండకూడదు.

**2డోది పారేనీళ్ళనుగురించి శాస్త్రసమ్మతము ఎట్లనగా :—**

పారేనీళ్ళలో ఆకుగాని, పుల్లగాని కొట్టుకొనిపొయ్యేటట్టుగా నుండవలెను. సదరు వచ్చేస్థలము నిండా శుభ్రమైన స్థలముగానుండవలెను. సదరు నీళ్ళవెంబడి (నజాసత్) అనగా మురికికొట్టుకొని వచ్చినా సదరు నీళ్ళతో వజూ, గుసుల్ చెయ్యవచ్చును.

**3 మూడోది—కువే అనగా చెలిమె (గుంట).**

వీటిలో పిచికె మొదలగు చిన్నపక్షులుపడి చనిపోయినయడల 20 ఇరవైడోళ్లు (బొక్కెన) నీళ్ళుతీసివేయవలెను. డోళ్లు అనగా షుమారు 3 పళ్ళు పరిమాణము అని "శిరాతుల్‌నజాత్" అనేపుస్తకములో వ్రాయబడివున్నది.

కోడియంత ప్రమాణముగల జంతువు వగైరాలు పడిచనిపోయినయెడల 40 మొదలు 60 అరవైబొక్కెనలనీళ్లు తీసివేయవలెను.

మేక, వంటె, మనిషియొక్క మురికి, కోడి, గద్దపియి, మనిషి, ఏజంతువు పడిచనినను, వచ్చినను, కుల్లినను, తునకలు అయినను, అల్పాచమానము, సారాయి, నెత్తురుపడినను వీట్లవల్ల నీరుమురికి అయినను (నజీసు) అని పిలవబడును.

యావత్తునీళ్ళను సాధ్యమైనమట్టుకు తీసీవేయవలెను, అటు తీసివేయుటకు వల్లలేకపోతే 200 మొదలు 300 డోళ్ళవరకు తీసి వేయవలెను.

అప్పుడు ఆనీరుశుభ్రమవును, ఆనీటితో వజూ, గుసుల్ చేయవచ్చును. ఆడోలుయొక్క అందాజు కొలత అయిదు శేర్లు అవునని "రూహుల్ ఇమాన్" అను పుస్తకములో వ్రాసియున్నది.

ఈగెలు, కప్పలు, దోమలు, బల్లులు యిటువంటి వస్తువులు పడిచస్తె నీళ్ళుశుభ్రముగానె వుండును.

——:0:0:——

శ్రీభగవంతుని దివ్యమహత్మ్యమును మిక్కిలి వినయముతో ప్రత్యహము స్తోత్రముచేయుచు మహాత్ములైన హజరత్ సయ్యాదినా షఫియ్యాన మొహమ్మదుగారికిని, వారిసంతతివారికిని, వందనములు చేయుచు నీచిన్నపుస్తకము అనగా "అఖాయదె ఇస్‌లామ్-ఫిఖ హె ఇస్‌లామ్" అనుగ్రంధము సృష్టికర్తయొక్క కృపాతిశయమువలన నిరంతరాయముగా సమాప్తిఅయినదని శ్రీస్వామివారి దివ్యపాద పద్మములకును, మహాత్ములైన హజరత్ సయ్యాదినా మొహమ్మదుగారికిని, వారిసంతతివారికిని అర్పణచేయుచు మాహెరబుస్‌సాని 1320 హిజరి 7 తారిఖ్ (12-7-1902 ఏ. డి.) చనిపోయిన నాద్వితీయ పుత్రుడగు సయ్యాద్ అబ్దుల్ ఖాదరుకున్ను ఘనతచెందిన నాతండ్రియగు హజరత్ హాకీం సయ్యాద్‌సాహెబుగారికిన్ని స్వర్గస్తురాలైన నాతల్లి గారికిన్ని నాకుటుంబమువారికిన్ని ఇహపరలోకములయందు సుఖము కలుగునటుల నీచిన్నపుస్తకమును భక్తితో చదువువారలున్ను విను వారలున్ను శ్రీభగవంతుని ప్రార్థన చేయుదురనిన్ని, అటుప్రార్థన చేయుచు భక్తితో చదివి అందులో చెప్పినమేరకు మనమతము యొక్క ఆచారములను బాగుగాతెలుసుకొని ప్రవర్తించునరులకు శ్రీ భగవంతుడు మోక్షమును యిచ్చునటుల ఖుదాయతలను మిక్కిలి ప్రార్థించుచున్నాను.

ఫిఖహెఇస్‌లామ్ గ్రంథకర్త సమాప్తము.

